ఓమ్

# స్వర్గభూమి

( స్టేజీ డ్రామా )

ఏడంకముల నాటకము



:: గ్రంథకర్త ::

శ్రీ బూరెల సత్యనారాయణ మూర్తి గారు



ప్రకాశకులు :

బండా నారాయణ శ్రేష్ఠి

బుక్ సెల్లర్ & పబ్లిషర్

జనరల్ బజార్, సికింద్రాబాద్ (దక్కన్)

.... 1950 ....

 ........ వెల రు. 1-0-0

## ఈ నాటకమున వచ్చు
## ముఖ్య నటీ నట సముదాయము.



| | | |
|---|---|---|
| కృష్ణారావు : | .... | కథానాయకుడు |
| రామారావు : | .... | శ్రీధరరావు మేనల్లుడు [కృష్ణారావు స్నేహితుడు] |
| శ్రీధరరావు : | .... | కృష్ణారావు మామగారు |
| వాసుదేవరావు : | .... | ,, తండ్రిగారు |
| గోపాలరావు : | .... | బొంబాయి నివాసి |
| పెంటడు : | .... | తోటమాలి |
| పద్మావతి : | .... | కథానాయకి [శ్రీధరరావు కూతురు] |
| కామేశ్వరి : | .... | పద్మావతి చెల్లెలు |
| వరలక్ష్మి : | .... | ,, తల్లి |
| మీనాక్షి : | .... | కృష్ణారావు తల్లి |
| శాంత : | .... | గోపాలరావు భార్య |
| కాంచనలత : | .... | బొంబాయిలో వేశ్య |

మరియు

సమయానుకూలముగా పోలీసాధికారి, భటులు మొదలగు వారు వచ్చెదరు.



# అంకితము.

నవమాసములు మోసి నన్గాంచి భువియందు
విడి దివి కేగిన విమలమతికి
నా ముద్దుముచ్చటల్ నయమార వీక్షించు
భాగ్యంబు గనని సౌభాగ్యవతికి
సతతమ్ము పతిపూజ సల్పుచు న త్తమా
మల సేవ జేసెడి మాన్యవతికి
తనవారు పెరవారు ననుభేద మిసుమంత
యైన లేక మెలంగు వినుతమతికి

సరసవచనాంతరాత్మకు, శాంతమతికి
నచ్యుతాంబా వధూటికి, నధిక భ క్తి
నంకితం బిత్తు దీని నిశ్శంకతోడ
ఆమె యాత్మ యొకింత హర్షమ్ము చెంద॥

—గ్రంథక ర్త.



# ప్రార్థన



వందనం బిడె భక్తరంజన !
వందనం బిడె వనధి శయన !
వందనం బిడె పతిత పావన !
వందనం బిడె వసుధ రక్షణ ! -1-

సకలదుఃఖ నివారణాయ !
సకలభయ నివారణాయ !
నిఖిల లోక పాలకాయ !
నిరుప మానందప్రదాయ ! -2-

కర్త వీవే ; భర్త వీవే ;
హర్త వీవే సుమ్మ ; దేవ !
భక్తి కొాలదివి సేవ జేతుము ;
ముక్తి నిచ్చి చేదికొానుము ! -3-

అఖిల భువన జనన వృద్ధికి
ఆది కారణ మీవ గావ !
అసుర భంజన ! భుజగశయన !
ఆదరింపవె చంద్రనయన ! -4-



శ్రీరస్తు—శుభమస్తు

# స్వర్గభూమి

## ప్రథమాంకము ప్రథమరంగము



(ప్రదేశము—ఉద్యానవనము—ప్రవేశము—పద్మావతి)

పద్మావతి:—ఆహా! పరమేశ్వరా! నాగతి నెంతలో, నెంతటి మార్పు గావించితివి. సకలానందములతో, మదీయ నాథునిగూడి "స్వర్గ భూమి"గా నలరారెడు నా గృహంబు నేడొక పాడువడిన దేవ ళము పగిది గావించితివిగదా!

సీ॥ అల్లిబిల్లిగ నల్లు మల్లెపూదీగెల
కరణి, జీవితముల గడపునాడు,
చిలుక గోరింకలవలె మెలంగుచు, ప్రేమ
పల్కులతో సదా కుల్కునాడు,
హాయిగా విహరించు హరిణద్వయమురీతి
మది చెంగలింపగా మసలునాడు,
వలపు కోర్కెలను కోయిలదంపతుల మించి
ప్రణయగీతము లెన్నొ పాడునాడు,
గీ॥ అప్సరాంగన లతికుతూహలముతోడ
నందనోద్యాన వనమందు నాట్యమాడు
స్వర్గమునకంటె, మా గృహవైభవంబె
"స్వర్గభూమి"గ నెంచితి భావమందు.

కాని, నాటిస్వర్గభూమి నేడిట్లు యెడారివోలె నగునని కలనైన దలంపకపోతిని. హా! హతవిధీ! మనోహరాకారుడగు మన్మనోహరుని పెడదారుల ద్రొక్కనిచ్చు చుంటివిగదా!

ఉ॥ ఇప్పటి కెన్నియో దినములేగె; మరెచ్చట నున్నవారొ? వా
రెప్పుడు వచ్చునో తెలియ కీగతి వేగుచునుంటి దైవమా!
ఇప్పగిదిన్ జరించె నిక నేగతినుండుదును మన్మనంబు; యిం
కెప్పటికేని సౌఖ్యము గ్రహింతునొ! లేదొగదా! పరాత్పరా॥

(పతినుద్దేశించి) హా! నాథా! వత్సరంబులు గలించుచున్నను నీ సుందరవదనారవిందంబు గాంచు భాగ్యంబు కలుగక పోవుచున్నది గదా! ఈ దాసురాలిపై కృపయింకను రాలేదా? ........ పరమేశ్వరా! =( అనుబంధము నెం1 )=

—• ప్రవేశము—కామేశ్వరి •—

కామే:—అక్కా! ఇక్కడ నొంటరిగా గూర్చుండి ఏమి చేయుచుంటివే? (ముఖము పరికించి) ఏడ్చుచుంటివా?

పద్మా:—లేదమ్మా! లేదు. (కండ్ల నొత్తుకొనును.)

కామే:—కాదు. దొంగమాట లాడుచున్నావు....ఏమిటిది అక్కా! నీవిట్లుప్రతిరోజు దుఃఖించుట! బావ నేడుగాకున్న రేపయినను రాకపోవునా?

....[ అనుబంధము నెం. 2 ]....

పద్మా:—చెల్లీ; నీవుచెప్పినది సత్యమే. కాని, ఆయనను తలంచుకొన్నప్పుడెల్ల కలుగు దుఃఖము వర్ణనాతీతము. ఏమందువా,

గీ॥ అధికవాత్సల్యముననను, పద్మా! యటంచు
గ్రుచ్చి కౌగిట జేర్చు నాకూర్మి యెల్ల
నెట్టి ప్రళయాగ్ని శిఖలందు బెట్టినారొ!
కాని, నావంక కననైన మానినారు॥

కా:—అక్కా! ఇదియంతయు పూర్వభవమందు చేసుకొనిన పుణ్యమని నాతలంపు. ఏమందువా?

ఆ. వె. "తొలుతజన్మమందు జిలుకను గొనివచ్చి
పంజరమున నుంచబట్టి, ముమ్ము

రామదాసు పట్టి ప్రాణసంకటమైన
యాతనొందె" ననుచు నార్య లనిరి.

పద్మా:—అవును. నీ సుడులు సత్యమే. మహానుభావులగు వారి నన వలసినదే లేదు. "చేసుకొన్న వారికి చేసుకొన్నంత"యే గదా!

కా:—అందులకే ధైర్యముగా నుండుమని చెప్పుట. అడుగో! రామం బావ వచ్చుచున్నాడు; దిగులుగానుండకు.

—• ప్రవేశము—రామారావు •—

రామా:—(తనలో) పాపము! పద్మస్థితి గాంచిన నెంతవారికిని జాలి కలుగకపోదు. ఎటువంటి దాంపత్యమున కెటువంటి యవస్థ కలి కలిగెను. ఆహా! కాలమహిమ!

( అనుబంధము నెం. 3 )

(వారిని సమీపించి) అక్కచెల్లెండ్రిరువురు నేదియో మాటాడు కొనుచున్నారే! నేనున్న........

పద్మ:—అబ్బే—ఆటంక మేమియును లేదు. ఏదో లోకాభిరామాయణము. రా కూర్చుండుము.

రామా:—(కూర్చుండి పద్మమోము జూచి) ఏ మిది ముఖమంతా అలా ఎఱ్ఱగా కందిపోయినది?........

కామే:—ఆ. ఏమియులేదు. అక్క....కి (పద్మవారించుచున్నను) బావయ్యజ్ఞాపకం వచ్చినట్లున్నాఁడు. అందుచేత.

రా:—బాగు బాగు ఎప్పుడు నొకటే తీరా? దుఃఖము దిగమింగాలి గాని. ఎప్పుడూ ఇలాగే ఉంటుందా కాలము?

చ॥ దిగులు దొలంగుమమ్మ! ఒకతీరుగ నుండునె సర్వకాలమున్
వగపు వహించుమాత్రమున వచ్చునె? కాలము కూడిరావలెన్
పగలును రేయి, నిట్లతనిపై మన సుంచిన లోకులెల్లరున్
నగుదురు సుమ్మ; లెమ్మ; సుమనస్కత నుండుము ధైర్య
[బుద్ధిపై॥

కామే:—అవు నక్కయ్యా! ఇలా కన్నీటి ధారలచే నిత్యము తడిసి పోవుట కూడదు నీకై, నాన్నా, అమ్మ ఎంతగా కుందుచున్నారో చూచుచు గూడ ఇట్లు బాధపడుచూ, బాధపెట్టడము మంచిది గాదు. నీ విదేమీ ఆలోచించినట్టే లేదు.

రా:—పద్మా! ధైర్యము తెచ్చుకో! అదుగోమరల నేడుపు ప్రారంభించితివి. ఇట్లా నైన ఎట్లు చెప్పు. గత్యంతరము చూచుకోవాలి గాని.

పద్మ:—రామం! ఏమిచేయుమందువు. ఈదుఃఖాశ్రువుల నెంత యది మినసు పైకుబుకుచునే యున్నవి. ఒకనాడా, రెండ్నాళ్ళా! రః యెడబాటు.

చ॥ చనియె దినంబు లెక్కుడుగ; జాలగ మాసము లంతరించెగా
జనియెను వత్సరాలు కడుజక్కగ; నింకను నెన్నివోవునో
యని మదియందు దోచగ మహాపరితాపము గల్గుచుండె; "నీ
దిన మిటులే గతించు"నని దేవుడు వ్రాసెగబోలు నొష్టపై.

కొ:— అక్కా! నీ వి ట్లధైర్యముగా మాటాడకు! కష్ట సుఖములు, వెన్నెల చీకటులతో దుల్యములట. కావున కష్టములు కాపురముందునా యేమిటి?

రా:—........ఇంక రండి లోపలకు బోవుదము.

... తెర ...



# స్వ ర్గ భూ మి

## ప్రథమాంకము—ద్వితీయరంగము

-(ప్రదేశము మందిరములోగల నొకపెద్దహాలు ప్రవేశము-వరలక్ష్మి శ్రీధరరావు)-

శ్రీధర:—ఆహా! కాలమెంత వైపరీత్యము! "పువ్వో పువ్వో" యని దేనిని మనము మహానురాగముతో జూచుకొనుచుందుమో, దానికే కీడు మూడుచుండును. అను బుధోక్తి మనపట్ల సార్థక మాయెను. ఏమందువా?

సీ॥ ఏబిడ్డ జన్మకై యెనలేని హర్షప
యోధిలో స్నానంబు నొందినాము!
ఏపాప బాల్యక్రీడా పరంపర జింత
లెల్ల దొఱగి సంతసిల్లినాము!
ఏచిట్టి జ్ఞానాభివృద్ధికై తగువిద్య
గఱపించి వీక్షింప గలిగినాము!
ఏపట్టి మేలుకై యింతింత యనరాని
శ్రమల నొందుచు, నామె సాకినాము!
గీ॥ అట్టిబిడ్డను యోగ్య మైనట్టి చిన్న
వాని కర్పించి తంచునే బరమసంత
సమున నుప్పొంగిపోవుచు సంచరింప
నిట్టిస్థితి గూర్చెగా దైవ; మేమి చెప్ప!

-(ప్రవేశము ఉద్యానవనమునుండి కామేశ్వరీ, పద్మ, రామారావులు)-

శ్రీధర:—పద్మా! ఇంతవఱకు నేమి చేయుచున్నారమ్మా!

పద్మ:—ఉద్యానవనములో గూర్చున్నాము నాన్నా!

రా:—మామయ్యా! ఏదియో ఆలోచించు చున్నట్లున్నావే.

వర:—ఏమున్నది నాయన! కృష్ణుని గుఱించియే అంతకంటె నేమి గలదు?

రా:—మామయ్యా ! పెద్దలు మీరును యిట్లు విచారించుచున్న నిక పద్మకు ధైర్యము గొల్పువా రెవరు ?

గీ॥ మీరలే యిట్లు దురపిల్ల దారికలపె
కడువిచారంబుచే గ్రుగ్గి కాృలుచున్న
పద్మ ? కటుగాన జింత నావలకు ద్రోసి
ధైర్యము వహించి పైపని తడవు డింక॥

శ్రీధర:—ఏమి చేయుమందువు రామం ? స్వయముగా గూడ వెళ్లితిని. వరుసగా వారంరోజులు గుమ్మముదగ్గర పడిగాపులు గాచినా దర్శనము కాలేదు. ఎల్లప్పుడు నాలలితతోనే, ఆయింటిలోనే యుండునట, కంటికి గనిపించినచో నేమైన జెప్పవచ్చును ; తీసుకొని రావచ్చును.

వర:—ఏమండి, రామారావును బంపి పిలిపించిన నెట్లుండును.

పద.—అమ్మా ! నీకేమయిన మతిపోయిన దేమిటి ? నాన్నగారికి గనిపింపని వారు రామంబావకు మాత్రము కనిపింతురా ? కనుపించినను వత్తురా ?

కామే:—అమ్మ ఉద్దేశము నీవు కనిపెట్టలేదక్కా ! రామం బావ, కృష్ణారావుబావ కలిసి ఒకేదగ్గర చదువుకొన్నవా రగుటచేతను, ముఖ్యస్నేహితు లగుటవలనను, నీవలన బంధువు లగుటవలనను ధైర్యముగా బావ యెక్కడున్నను, పోయి తీసికొనివచ్చునని— అంతేకదే అమ్మా ?

వర:—అవును. నా తలం పంతియే.

శ్రీధర:—అంతియే, నేను వెళ్ళగా నింతైనది, ఇంక రామం........

పద్మ:—ఎవరు వెళ్ళిన నేమి లాభము ? ఇంతకూ నా యదృష్టము బాగుగా నుండిన నన్నియును బాగుగా నుండెడివి.

వర:—వెఱ్ఱితల్లి - చిన్నప్పు డెంత గారాబముగా పెరిగినదో, ఇప్పు డంతగా కృశించుచున్నది.
శ్రీధర:—అవును. పద్మ నుడివిన ట్లిదియంతయు దానియదృష్టము చక్కఁగా లేకపోవుటయే. కాకున్నచో ని ట్లతిచిత్రముగా కృష్ణుడు మారిపోవుటయేమి ? ఏమందువా ?

క॥ జననీజనకులయెడ కడు
వినయంబున మసఁచునుండి, పెద్దల నుడులన్
గొని నయమార్గమ్మున జను
వినయుడు నేడిట్లు జెడుట విస్మయముగదే !

వర:—జరిగినదేదో జరిగినది. ఇపుడు చేయునది యోచింపుడు.

రామా:—(దృఢచిత్తముతో) అత్తయ్యా ! యోచన కే మున్నది ? మీరన్నట్లు నేనే వెళ్ళి, అక్కఁడ కృష్ణుడేస్థితియం దెక్కఁడెక్కఁడ సంచరించుచుండునో, అన్నియు కనిపెట్టుచు, మీకు తెలియపరచెదను. తప్పక తీసికొనియే వచ్చెదను. ఇంక, మీరేమియు నతని కొరకు విచారించకుడు. ఇది నా మనఃపూర్వకముగా పలికిన పలుకులేగాని యన్యములు కావు. కాన, ప్రసన్నవదనములతో నన్ను దీవించి పంపుడు. మీరలింక విచారంబుల నుడుగుడు.

శ్రీ: వర:—మంచిది నాయనా, పోయి రమ్ము. నీ తలంపు నెరవేరుగాక, భగవంతుడు నీకు తోడ్పడునుగాక !
రామా:—నే నీరాత్రి బండికే వెడలవలెనని యున్నది.
శ్రీ:—మంచిది, మన తోటమాలి పెంటయ్యను స్టేషనువరకు సహాయముగా గొనిపొమ్ము. నీసామానుగూడ తీసికొనిరాగలడు.
రామా:—మంచిది.

— తెర —

# స్వర్గభూమి

## ప్రథమాంకము—తృతీయరంగము.

(ప్రదేశము—ఉద్యానవనము. ప్రవేశము—పెంటడు.)

[పూలమొక్కలకు బోదెలు వగయిరా బాగుచేయుచు పాడుకొనుచుండును.]

పుష్పముల పెంపంగజాలెడు - పురుషు లెవరీ ధరణిలోన?
పుష్పలావికుడైన పెంటడె - పూర్తిగా కనుగొన్నవారికి
నన్ను మించెడు వార లేరీ?
నన్ను మించెడు ప్రజ్ఞ లేరీ? ॥పు॥

గొప్ప త్రవ్వట చేతకాని - కుండె కట్టుట అసలె రాని
అప్పుడే పెద్దాయె చూడగ - నిప్పు దహహా! ఏమనందు
కానిరోజుల ఫలిత మిద్ది!
కాకపోయిన నేమి యిద్ది? ॥పు॥

కత్తిరింపులు నేర్వలేని - ఎత్తరింపే తెలియలేని
సత్తిగానికి వారితోటలో - పెత్తనం బట! కాలమహిమ!!
ఎంత చిత్రమొ చూచినారే?
ఎంత వింతయొ గాంచినారే? ॥పు॥

(అన్నపుగంపతో పెంటనిభార్య ప్రవేశము)

పెం॥భార్య:—మన్నముద్దల పిసుకు సామి - అన్న మిదిగో లెండు సామి
వెన్నముద్దలవలెను మ్రింగగ - వేడ్కతో రావోయి సామి!

పెం:— ఒహోహో! నీవా? వచ్చినావా?
ఒకతెవే యరుదెంచినావా? ॥పు॥

పెం:—యేమే! ఈయాళ ఇంతబేగే అన్నముతెచ్చావు? ఏమిటి సంగతులు?

పెం;భా:—సంగతులేంటి, వంటయిపోయింది పట్టుకొచ్చేసేను దాని కేం, రాతిరికింటి కొస్తావా? ఇక్కడనే....

పెం:—ఎబ్బే....కాస్తమాటుమణిగాక....ఆ....వస్తాను;మాటామంతీ అయాక....ఆ....తిరుగొస్తా నిక్కడకు ఏం?

పెం;భార్య:—ఆలాగే కాని, ఇంట్లో బియ్యము గియ్యము ఏమి లేవు. తొందరగా చూచుకొని రా.

పెం:—అబ్బా! ఇక్కడింటిగొడవ యెందుకే? ఎలాగో చూసుకొందూ! నేనొచ్చాక చూస్తాను.

పెం;భా:—ఏంటి చూస్తావ్ ఎప్పుడో వస్తానంటావు నేనేం చెయ్యను అన్నిటికీ నేనొక్కతనే ఎలా చూసుకుంటాను.

పెం:—ఈపూటకు చూసుకోయే.

పెం;భా:—నేను చూసుకోను ; నేనేమిచెయ్యను.

పెం:—(కోపముతో ప్రక్కనున్న చిప్పను తీసుకొని) చెయ్యవుటే?

పెం;భా:—(కోపముతో నడుము బిగించి, చీపురుకట్ట లాగికొని) ఏమిటీ మగతనము!! (మగనిని కొట్టుచుండగా, మగడు గంతులిడును).

( అనుబంధము 4 )

—.) రామారావు ప్రవేశము (.—

రా:—(నవ్వుచూ) ఏమిటిరా పెంటడూ! అలాగంతులు వైచుచున్నావు! సంగతేమిటి?

పెం:—(నవ్వుచు, తలగోకికొనును) ఆ....ఏంలేదండి....మఱి....ఆ నువ్వెళ్ళే....నేను రాతిరి కొస్తానులే.

పెం;భా:—(తట్టబుట్ట సర్దుకొని పోతుంది ; కోపముతో)

రా:—చూడు పెంటడూ! నేను కృష్ణారావు బాబుకోసం వెళ్లుచున్నాను? పెట్టెఅది తెచ్చిపెట్టాలి రైలుదాకా వస్తావుకదూ?

పెం:—చిత్తము చిత్తము బాబూ....మఱి....నాదో మనవి.

రా:—ఏమిటది?

పెం:—మఱి నాపెళ్ళానికి చిల్కుచీర ఎఱ్ఱగా, పచ్చగా....నల్లగా.... మిలమిల లాడిపోయేది. సినిమాటారులు కట్టుకొనే లాటింది కొని తెచ్చిపెట్టరండీ....దానికోసం ఇప్పుడేడుత్తూ పోయింది.

రా:—ఆలాగే తప్పకుండ;

# స్వర్గభూమి

## ద్వితీయాంకము—ప్రథమ రంగము.

—)…. ప్రదేశము-ఉద్యానవనము-ప్రవేశము-లలిత ….(—

లలి:—(స్త్రూడెంటు రూపమున వచ్చి, అటుఇటు చూచుచు) కృష్ణుడింకను రాలేదేలనో ! (వనసౌందర్యము నవలోకించుచు) ఆహా! ఏమి యీవనరామ ణీయకము ! ఎంత నేత్రోత్సవముగా నున్నది! (చేతనున్న పుస్తకము లటబడవైచి, తిరుగుచు) ఆహా! ఇట్టిసుందర తరమగు విహారభూమిని, అందును మధుమాసమందలి ఈఉద్యానవనమును చూచిన ఎవ్వరికి ఆనందము కలుగకుండును ? (కృష్ణారావు వచ్చి రహస్యముగా పొంచుండును) ఆహా!

చ॥ నలుగడలందు రత్నములనందగు మోదము నిచ్చుసూనముల్
కిలకిలలాడుచున్ జెలగు కీరసమూహము; వేడ్కసేయుచున్
కులుగుచు గొంతునెత్తి నల కోయిలసంతతి ; నెల్లగాంచ, మి
క్కిలి ప్రమదంబు గల్గెమదికిన్; మధుమాసవనంబులోపలన్

కష్ణారావు:—(వెలువడి) అవును ఎంతయు నానందము గొల్పుచున్నది ; అందును నీవంటి లలితాంగి యిచ్చట నుండబట్టి,

ఉ॥ కల్లయొకింతలేదు ; యిట కాంత యొకర్తు నవీనభావయై
చల్లని పిల్లగాడ్పులకు సల్పుచునుండె విహార ; మిట్టి సం,
ఫుల్లసరోజనేత్రి ముఖమున్ గన మ్రోడులుగూడ నాశతో
నల్లన నక్షులన్ దెఱువ యత్నము సల్పెడుగాంచితే ప్రియా!

లలిత:—అమ్మదొంగ ! నీవిక్కడనే దాగుకొని యున్నావా ?

కృ:—దాగుకొనలేదే! నేను యిప్పుడే వచ్చితిని. ఇంతలో నీకంఠము గూడ వినబడినది దానికి ప్రత్యుత్తర మిచ్చితిని ఇంతియే.

ల:—సరియేకాని, నే డింత యాలస్యమేల కలిగినది?

కృ:—ఆలస్యమున కేమికలదు? నేడు నామిత్రుడు రామారావు అనే నా తోడల్లుడు వేంచేసి, ఏవో నాలుగు ముక్కలు చణిగితే దానికి సమాధానమునిచ్చి వచ్చితిని.

లలి:-ఏమిసంభాషణ నేను వినవచ్చునా?

కృ:-ఆహా! తప్పక రా అక్కడ కూర్చుండి చెప్పెదను.

తెర

-:(ఉద్యాన వన సమీపము—ప్రవేశము, రామారావు సాధువు రూపముతో):-

రామా:-ఆహా! కాలమెంత గొప్పగా తనప్రభావము జూపుచున్నది. హుం నేటి యీ కృష్ణుని స్థితికిని, నాటి యావిద్యార్థి కృష్ణునిస్థితికిని నెంతవ్యత్యాస మున్నది.

సీ॥ తల్లిదండ్రుల నెంత దయతోడ గాంచెనో
యంతటి యవివేకి యయ్యెనేడు;
చెలికాండ్రతో సదా కులుకుచు దిరిగెడు
మిత్రుండు నే డొక శత్రువయ్యె;
పరకాంతపొం దూనవలదని బోధించు
వాడు నే డొకకాంతవలను జిక్కె
అగ్నిసాక్షిగ వివాహము పొందినటువంటి
పద్మావతిని వీడివైచి నౌర

గీ॥ వీనిబాగోగులను జూచి, వేడ్కనెంద
వలయు ననియెడి యత్తమామలను దూఱి
నక్కటా! ఎట్టివా డెట్టులాయె తుదకు
వీనికి హితంబు సెప్పగా వినడు సుంత॥

పొర్లిద్దుట నే నెన్నివిధంబుల ప్రార్థించితిని ; ఎన్నివిధంబుల బోధించితిని; ఎన్నివిధంబుల జడిపించితిని, కాని, నాయత్నమంతయు బూడిదపోసిన పన్నీరై నదికదా. ఇంక వీనిని నయభయంబుల దోడ్కొని పోవుట కష్టతరమైనదిగా! గన్పించుచున్నది. కావున నేని ప్పుడీ రూపమున, నెప్పటికప్పుడు వీనిస్థితి గతులు కనిపెట్టుచు, నెప్పు డసహాయస్థితియం దీతడు అల్లాడుచుండునో, అప్పుడేవీనిని తోడ్కొని పోయెదగాక (పరిక్రమించి) అదిగో లలితా కృష్ణు లేదియో మంతనం బులు జరుపుచున్నట్లున్నారు రహస్యముగా నాలించెదను గాక !

( పోయి వారికి గనుపడకుండదాగి, వినుచుండును. )

( కృష్ణుడు లలిత యటగల కమలాకరమలచెంత గూర్చుండి )

ల:-(నవ్వుచు) నిన్ను వెదకుచు వచ్చిన నీస్నేహితునట్లు త్రోసిపు చ్చుట మంచిపనిగాదు.

కృ:-చెలీ! ఇది నీవనుటయు మంచిపనిగాదు. ఏ మందువా? నాకు, ఇంటిమీఁద....రవ్వంత ప్రేమయైనను జనించుటలేదు. సర్వ ము....నాకీ లలితమీఁదనే యున్నది.

ల;-ఓహో....భార్య ప్రక్కలోనికి చేరువరకే యీ పట్టుదల మాటలు.

కృ.-కాదు; కాదు; నే నెప్పుడైతె యీ మహానగరము చదువు నిమి త్తమై చేరితినో....ఎప్పుడు నీకు గురువుగా ప్రవేశించితినో, అప్పుడే నాపట్టుదల యంతయు నంతరించి పోయినది. ఇంక నెక్కడిది?

ల:-నిజముగా?....అట్లయినచో నన్నెప్పుడును విడనాడ వలదుసుమా! నీవు వెడలెదవేమోయని యనుకొను నపుడెల్ల హృదయమునం దెంతయో బాధ కల్గుచుండును.

కృ:-లలితా! నీవెప్పుడు నట్టి యనుమానమును జెందవలదుసుమా! నాపై నీకుఁగలప్రేమయే యట్లు వేధించుచుండును. అదియును గాక నేనుమాత్రము నిన్ను విడనాడ గలుగుదునా?

లలి:-ఏమో! పురుషుల నెవరు నమ్మగలరు?
కృ:-చెలీ! నే నందఱివంటి వాఁడనే యైనచో నీవనినమాట సత్యమే నీపై ప్రేమచేత నేగదా:

సీ॥ పదిమందియెదుటను భార్యగాఁ గైకొన్న
పద్మావతిని వీడి వైచినాను?
నను నాదు పురికిని గొనిపోవ వచ్చిన
తండ్రినైనను నీడ్చి తన్నినాను
ననుగాంచ దిగిన మామనుగూడ నట్టులే
ఇంచుక దయ సత్కరించినాను
నీవు "ట్యూషను"జెప్ప, నేర్పుగా నిచ్చట
నుద్యోగమును బొంది యొప్పినాను
గీ॥ ఇన్నియును నీదు ప్రేమ వాంఛించి కాదె
సలిపి యుంటిని జూడ నోలలిత! నేను;
ఆకసము భూమియును మాయ మైనఁగాని
అంతరింపదు; మనదు ప్రేమామృతంబు:

కావున, నీ పిచ్చిపిచ్చి భ్రమల నికఁ గట్టిపెట్టుము. దీనికేమి గాని యీ ఆనందము మీనాన్నదినుమా!
లలి:-అదెట్లు?
కృ:-ఇట్లు....మాష్టరుపదవి నిచ్చుటయేకాని, నీ బావయగు వెంకటరావు మాత్రము చీకాకు పడుచుండును. కారణ మేమయి యుండునో?
లలి:-[విసుగుతో] అతఁగాడికి నన్నిచ్చి వివాహము చేయవలయునని మానాన్న నిశ్చయించుకొనుచున్నాడు. ముఖ్యముగా ఆవిషయము గుఱించియే నీతో మాటాడనెంచి నేడిట్లు రమ్మనుట.
కృ:-ఉహుఁ....ఇదియా అసలు సంగతి. ఇంతవరకును నాకింతయు దెలియజేయవేమి?

క॥ రూ పిమంత యులేని కు
రూపునికా విన్నొనగుదురు; భళీ! మదిలో
నీపలుకు జొచ్చి యెంతయొ
వేపుచు జెలరేగె గంటివే? కమాలాక్షీ!

సౌందర్యమేగాక విద్యాగంధము రవ్వంతగూడ లేకపోయినను, ధనమే ప్రధానముగా నెంచి, యీసుందర సుకుమార శరీరము, నా శుద్ధమూర్ఖుని కర్పింప నెంచెనా? మీనాన్న!

లలి:-అవును. అతనినాకై చాలాకాలముక్రిందటనే గొనివచ్చి యింట నుంచెను. నాకు మేనత్త కుమారుడుకూడ. ఇంతకాలము నాపట్టు మీదనే ఆగినది.

కృ:-అట్లయిన నిప్పుడే మిచేయ దలచితివి?

లలి:-అదియే ఇప్పు డాలోచన....చూడు, మన మిరువురము నెక్కడికైన బారిబోవుదమా?

కృ:-ఆ! ఏమంటివి? పారిపోవుటయా! అదియెట్లు పొసగును? లోకు లేమనియెదరు?

లలి:.ఏమనియెదరు? పూర్వము గురువుభార్యతో వెడలిపోయిన నా చంద్రు నెవరేమన గలిగిరి?

ఆ॥ వె॥ విద్య బడయగోరి వినయమ్ముతో బృహ
స్పతిని జేరి, వానిసతిని జెట్ట
బట్టి తన నగరము బట్టి యేగినచంద్రు
రీతి మనము సంచరింప నేమి?

కృ:-ఏమి? ఏమియునులేదు. కాని, వారు దేవతాసంభూతులు. మనము కేవలము మానవమాత్రులము. అందువలన మనము పరదేశముల కేగిన నేవిధముగా కొనసాగునా యని....

లలి:-ఆ భయము నీకేల? ధనలోపము కలుగనీయను (రామారావు ఆత్రముతో వినుచుండును) నా వస్తువులన్నియు గలసి 5 వేల

రూపాయలకు మించియుండును. మాఅమ్మవంతకంటె నెక్కువ గలవు. ఇవియు, రొక్కము కూడ....చాలా?....

కృ:-మఱి....ఆవస్తువులన్నిటి నెట్లు సంపాదింతువు?

ల:-ఆగొడవ నీకేల? ఆపని నేను చూసికొనియెదను "ఆలస్య మమృతమ్ విషమ్" అను నార్యోక్తి వినలేదా? కావున మనము ఈ రాత్రియే పోవుదము. సిద్ధముగా నుండినట్లేకదా!

కృ:.తప్పక? ఎన్నిగంటల కిక్కడకు రమ్మని సెలవు?

ల:-12 గంటలకు? మఱచి పోవలదుసుమా!

కృ:-మఱచి పోవుటయా అది యెన్నటికిని జరుగదు. ఏమందువా?

క॥ కంతుని పూములికియొ యను
కాంతామణి తనకు దాన కనకమ్ముతో, నా
చెంతకు జేరిన, వలదను
నంతటి సాహసముగలదె? యతివా! నాకుఁ.

లలి:-మంచిది. మన ప్రయత్నములు సఫలీకృత మగుగాక!

కృ:-మనల కుసుమాస్త్రుడు ప్రేమతో వీక్షించుగాక!

(రామారావు (సాధువరూపమున) ప్రవేశించి) ప్రబోధము-పాట.

పరభామినులను పా దొనరించుట
పాడియె నీకిది జీవా!
పరమభక్తితో పరమేశుని పద
పంకజముల గను జీవా! ॥౧॥

దురితా లోచన దుష్టతలంపును
ద్రోయుము వేగమె జీవా!
నిరతము హరినే నెమ్మది గొలిచిన
దొరకును మోక్షముజీవా! ॥౨॥

లలి:-ఇదియొక మెట్ట వేదాంతము!

కృ:-కాకపోయిన బైరాగిముండకొడుకునకు ప్రేమతత్వమేమి తెలియును?—రా పోవుదము. (నిష్క్రమించును)

రామా:-ఆహా! ఏమి వీరి కుట్రాలోచన ఈవిషయ మేమె తలిదండ్రులకు దెలియజేసి....అ....వలదు. వీరి నూతనపంథా ఎంతవరకు సాగగలదోచూచి, పైవిషయ మాలోచించెద గాక! నేను వీరి వెన్నంటియే యెచ్చటికి బోవుదురో గమనించెద గాక !

— తెర —



# స్వర్గభూమి

## ద్వితీయాంకము - ద్వితీయరంగము.

ప్రదేశము:-వాసుదేవరావు మందిరము— ప్రవేశము:-మీనాక్షి, వాసుదేవరావు

( అనుబంధము—౯. )

వాసు:-ఎందులకీ వృధాకంఠశోష? ఊరకొనుము.

మీ:-అయిన నిక నాశ వదలుకొన వలసినదేనా?

వాసు:-అన్నమాటయే. ఎప్పుడు వానికిబుద్ధివచ్చి ఇల్లుపట్టునో, అప్పుడే మనకు పుత్రుడు. అంతవరకు మనకు పుత్రుడే లేడనుకొందము.

మీ:-అలా అనకండి. ఇంకోసారి బాబుదగ్గరకువెళ్ళి వచ్చెదమురండి ఈసారి నేనును వచ్చెదను.

వాసు:-ఓసి వెఱ్ఱిదానా! నేను చెప్పుటయైనదిగదా! ఇంకను నీ వేమి చెప్పుదువు? "ఆ లలితనువీడి నీభార్యతో సుఖించరా నాయనా!" అని అని నందులకేగదా! తండ్రిననియైన జూడకుండ తన్ని తరిమివైచినాడు. అట్టి యా నికృష్టుని గురించి యెందులకీ వృథా ప్రయాస?

మీ:-ఏమండీ, ఆ లలిత తండ్రితో "నీ కుమారిత, నా కుమారుని వలలో వైచుకొని, నాసంసారము పాడు చేయుచున్న" దని చెప్పిన నెట్లుండును.

వా:-వినిన బాగుగానే యుండును. కాని, "వారిరువురు నేకమయినప్పుడు నేనేమి చేయను? అనిన మనకు దలవంపుగదా! చూడు మీనా! ఇంతకూ మనబంగారము మంచిదైన కమసాలి ఏమి చేయగలడు?

( పోష్టుద్వారా యుత్తరము వచ్చును.)

మీ:-ఎక్కడనుండి వచ్చినదండీ అది? బాబుగాని....

వా:-కాదు. రామారావు వ్రాసినది. వినుము.

"వాసుదేవ రావుగారికి:-

రామారావు నమస్కారములు.

త॥ నేను కృష్ణారావును తీసికొని వచ్చుటకై ఇక్కడకు వచ్చినసంగతి మీకు తెలిసియే యుండును. అతని కెన్నిరీతులు బోధించినను వినలేదు. మఱియునిప్పుడు ఆలలితతో ఎక్కడికో పారిపోవుచున్నాడు. వారిని నేను వెన్నాడుచున్నాను. జరిగిన సంగతులు ఎప్పటికప్పుడు మీకు తెలియజేయుచునే యుండెదను. మీరు ధైర్యముగా నుండుడు.

రా మా రా వు."

రా:—వింటివా మీనా ! నీకుమారుని చేష్టలు? మనము వాడికై విచారించడమే గాని, సుతలాము మనమీదలేదు వాడికి.

మీ:—ఆహా ! ఏమి ! యీమాయపనులు ? దుర్మార్గపు దోవల ద్రొక్కునని కలనైనను దలంపనే? ఎట్టివా డెట్టులాయెను ! ఏమండీ, రామారా వెవరండీ.

వాసు.—వియ్యంకునికి మేనల్లుడు.

మీ:—పాపము ఎంతశ్రమ పడుచున్నాదో! ఆహా పరమేశ్వరా నాచిట్టిబాబును నయమార్గమ్మునకు దీసికొనిరావా?

—( ( మీనాక్షి పాట ) )—

మంధరగిరిధరా! సుందర రూపా!
పొందుగా నీపదములను బట్టితిమి ॥1
కరివరదా! మామొఱవిని వేగమే
కరుణతో జూచిమమ్ సరగునబ్రోవుము ॥2
కరుణాకర! యో ఖగపతివాహన
శరణని జొచ్చిన సాకవిదేల? ॥3

వాసు:—అబ్బాయిమీద నీకెంత మమకారమే ఈ నీప్రేమలో రవ్వంతయైన వాడికి గలిగినచో బాగుపడుదుముగదా!

తెర



# స్వర్గభూమి

## తృతీయాంకము—ప్రథమ రంగము.



ప్రవేశము-కాంచనలత మందిరము.

(ప్రవేశము-4,5 గురు విటులు—కాంచనలత. కాంచనలత డాన్సు చేయుచుండును. విటులు పరవశ మగుచుందురు.)

కాం:—(డ్యాన్సు చేయుచు) పాట.

"జాల మేల సేసితివో చక్కనిబావా ! ఇంత
వేళవరకే డుంటివి చక్కనిబావా ॥1
హేటు, బూటు, షూటు వేసి చక్కనిబావా! నీవు
సీటుగాను వచ్చుతేన చక్కనిబావా ! ॥2
పానము, పన్నీరులకును చక్కనిబావా ! నీవు
పైకమేమి తేలేదోయి చక్కనిబావా ॥3
సొమ్ము లెన్నొ తెస్తానని చక్కనిబావా ! నాకు
నమ్మకము కలిగించేవు చక్కనిబావా ! ॥4

వి:—ఓహోహో ! ఏమిపాట ! ఆహాహా ! ఏమిపాట.

కాం:—పాటకేమిలే మఱి నువ్వుతెస్తానన్న పైకము........

వి:—ఇదిగో ! అన్నదొకటీ చేసేదొకటీనా ? (పైకము మూట యిచ్చును.)

2వ వి:—నేను తెస్తానన్న రవ్వల యుంగరము ఇదిగో !

కాం:—మఱి నీవుతెస్తానన్నది ఏది ?

3వ వి:—(తల గోకుకొనును) నేను నేనూ........రేపు

కాం:—తెస్తావు ? అంతేకదూ !

3వ వి:-ఆ....ఈవేళ మాయావిడయింట్లోకి రాకపోవుటచే తాళాలు....
2వ వి:—యివ్వలేదు ఏం? ఆడదాని పెత్తనమురా వీడిది! నేనేమిటో అనుకొన్నాను.

4వ వి:—ఆ ఊరకోరా! నీలాగ అత్తవారింటిలో సొమ్ము ఎత్తుకొని రాలేదుగదా !

..(: బయట తలుపుచప్పుడు :)..

విటులు:—అమ్మయ్యో! చచ్చాముగా! గోపాలరావు రాబోలు ఇప్పు డేందారి లతా ?

కాం:—(భయపడు చున్నట్లు నటించుచు) సమయమునకే వచ్చినాడు ఇదిగో మీరందరూ యీదొడ్డిదారిని పారిపొండి:

(వారట్లుచేయుదురు-తాను పాడుకొంటు వచ్చి తలుపు తీయును-గోపాలరావు ప్రవేశము)
గో:—ఏమిటీగానము ? కాస్తశుభ్రముగా పాడుదూ ? విని నేను ఆనందిస్తాను?

కాంచన:—

....[ అనుబంధము నెం. 6 ]....

గో:—ఆహా ! ఏమి నీ గానమాధుర్యము ?
కాం:—పాటకేమిలే కాని, ఏదీ ఈవేళ తప్పక తెచ్చెదనని ప్రతిజ్ఞ చేసేరే ? తెచ్చేరా రత్నాల హారము:—అదుగో ! పెడమోము నాఖర్మము.

గో:—లతా ! నీవిట్లు పీడించుచున్నచో నెట్లు చెప్పు ? ప్రస్తుతము చేతియందొక గవ్వయైనను లేదు. ఉన్నదంతయు నీకే వెచ్చించితి గదా !

కాం:—కొదంటినా యేమి ? ఎంతవెచ్చినను తుదకొక రత్నాలహారమునకైనను నోచుకోలేకపోయితిని.

గో:—ఆహా ! కాలము !

గీ॥ ఈ మహానగరమున నే నెంతయేని
వైభవంబుల దులదూగి వరలుచుండు
భాగ్యవంతుల యందు బ్రిపౖథముడ నయి,
ఒక్కహారమ్మునే దీని కొసగనైతి.

కాం:—ఏదో గొణుగుకొనుచు గూరుచుండుటయేగాని, అసలు సంగతి మాత్రము లేదు.

గో:—అసలుకి సిసలుకి నేముంది? ఉన్న సర్వస్వము పోయినదిగదా! మరల నేదేనిసొమ్ము అందిన వెంటనే ఒకటిగాదు 10 హారములు కొనితెచ్చెద.

కాం:—"పోయినది పోయినది" అని నామీద నిష్ఠూరము వేయడము గాని, అది ఏమయి పోయినదో, నీవే ఆలోచించుకొనుము ? నీఐశ్వర్యమంతయును, నీజూదమునకు నీత్రాగుడునకే రెండుచేతుల వెచ్చించుట యైనది.

గో:—(నవ్వుచు) ఆజూదమైనను నీతోడనే గదా !

కాం:—(త్రిప్పుకొనుచు) ఆ....అదినాకే వచ్చినదా ఏమి? మనమిరువురమే యాడితిమా ? మీపైనొట్టువేసి చెప్పుచున్నాను అందునా కొక కాసైనను రాలేదు నామీద బడటమేకాని.

గో:—పోనిలే ఏదో అయినది. నవ్వులాటకంటె నీకుదుకుబోతుతన మెందులకు ? (ఆలోచన నభినయించుచు) ఆ, అన్నట్టు మఱచి పోయితిని, కృష్ణారావను ధనాఢ్యు డొకడు యీ మహానగరము ప్రవేశించి మాయింటనే అద్దెకున్నాడు. నన్నేదేని యుద్యోగము చూడుమని ప్రతిమాలుచున్నాడు. ఈవేళ వెళ్ళెదమని చెప్పినాను కావున నాకొఱకు చూచుచుండునేమో పాపము! (వెడలబోవును)

కాం:—ఆగు, మఱి ఆయన ధనవంతు డంటివే ? ఇక నుద్యోగ మెందులకో.

గో:—బాగున్నది నీప్రశ్న. భాగ్యవంతులు ఉద్యోగము చేయరా? యేమి? భాగ్యవంతు డనుటకు ఆతనిభార్యకు చాల నగలుండగా చూచితిని.

కాం:—ఓహో! అలాగునా? వాని నీదారినే తీసుకొనిరమ్ము.

గో:—(నవ్వుచు) ఎందుకు? ఏమైనా........

కాం:—అబ్బే....ఊరికె....చూదామని.

గో:—అంతియేగదా! ఏదైన పన్నాగము పన్నుచున్నావేమో అనుకున్నాను.

కాం:—లేదు—ఒకవేళ సంవత్సరకు వచ్చిన ఓవివివరలో వలె నింకొక వెలుగు వెలుగుదువు గదా!

గో:—అట్లయిన సరియే కాని, నన్న న్యాయము చేయపురదా!

కాం:—రామ, రామ—మరి ఆత డనుమానము చెందకుండునుసుమా!

గో:—అది నాకు జెప్పవలెనా? పిచ్చిదానా! కాని, నీవు మాత్రము మేమీదారిని వెళ్లనప్పటికి, చక్కగా తయారయి వీధియరుగుమీద చిలుకలా—అ—నిలబడి, నన్నేదో నెపముతో పిలిచితివా? పైకథ నేనే నడిపించెదను—ఆ— (చెక్కిలినొక్కి వెడలును.)

కాం:—(వెటకారముగా) చిత్తము చిత్తము

... తెర ...



# స్వర్గ భూమి

## ద్వితీయ రంగము

(ప్రదేశము—గోపాల మందిరమునం దొకవైపు—ప్రవేశము—లలిత)

లలిత:—

( అనుబంధము నెం. 7 )

—:( కృష్ణారావు ప్రవేశించును. (:—

లలి:—ఎక్కడికి వెళ్లితివి?....మనసులో ఏమో భయముగా నున్నది సుమా!

కృ:—భయమా! ఏమి? నేనుండగనే.

లలిత:—నా తలిదండ్రులేమైన నక్కడ గడబిడ చేయుచుండిరేమో? యని........

కృ:—ఆ! చేసికొననిమ్ము. నీతలిదండ్రాదులకును మనపని సంతోషమే భగవంతునకే నచ్చినది మనచేష్టలు, ఏమందువా?

గీ॥ రమణి! మనకృత్యమునకు హర్షమున మెచ్చి
పరమపురుషుండె పంపె గోపాలరావు
నిచటి కీవిధి మనల రక్షించుటకును
గాకయుండినచో సహకారి యగునె!

కావున నీవిషయమున నెంతమాత్రము భయముజెంద నవసరము లేదని నాయుద్దేశము.

ల:—అయినను తగినజాగ్రత్తలో నుండవలె గదా!

కృ:—అవును. ఇక్కడనేదేని ఉద్యోగము దొరకిన మనకు చాలా లాభము.

లలి:—ఏమి?

కృ:—ఏమేమిటి ! ఒకటి మనము నిర్విచారముగా జీవించుట ; రెండవది ఆసందర్భములో నొకవేళ నీతలిదండ్రు లెవరైన వచ్చినను మనస్థితిగాంచి, "పోనిమ్ము భార్యాభర్తలవలెనే బ్రతుకు చున్నారు" అని చడీ చప్పుడు లేకుండ చక్కాపోతారు.

లలి:—అందుకొఱకేనా యిప్పుడు వెళ్ళినది ?

కృ:—కాదు, గోపాలరావుగారు వచ్చినతరువాత వెళ్ళెదము. ఇప్పుడు ఎక్కడకు వెళ్లలేదు క్రిందనేదో గుడివున్నది కదూ ! అక్కడ ఏదోపండగ చేసికొంటున్నారట—అలంకరించుతున్నారు. గుమ్మములో నిలువబడి చూచుచున్నాను.

లలిత:—ఉహూ, మఱి గోపాలరావుగారేదైన నుద్యోగములో నున్న వారేనా ?

కృ:—తెలియదు కాని, పెద్ద యుద్యోగస్తుని వలెనే కనిపించుచుం డును.

ల:—ఇక్కడకు వచ్చినప్పటినుండి చూచుచున్నాను. ఎప్పుడుచూచి నను భార్యమీద ఏవో కేకలు వేచుచునే యుండును. అదేమి తత్వమో మఱీ !

కృ:—నీదో పనికిమాలినభ్రమ! ఏమందువా గృహకృత్యవిషయము లెన్ని యుండునో, ఏమో ! (బయట కలకలము)

లలి:—అదేమిటి ? అల్లరి ?

కృ:—గుడివద్ద కాబోలు:

లలి:—ఏమిటో అది చూద్దాముర. (ఇరువురు వెడలుదురు.)

—)( తెరమార్పగా గౌరీదేవిగుడి )(—

(కొందఱుమనుజులు, గౌరీదేవికి బలిచ్చుటకై మేకలు, కోడిపిల్లలు, మొ. జంతువులతో వచ్చి. తప్పత్రాగి, ఆనందంతో)

(కా మి క్ పా ట)

సంతోసమున రండిరా .. మన
గౌరితల్లి జాతార సేసికొందమూ !

అంతా ఏకమైతే - అమ్మ సంతోసించు ॥సం॥
దున్నల్ని, ఎద్దుల్ని, మేకపిల్లల దెచ్చి
కన్నతల్లీ మెచ్చా కొన్కగా నిద్దాము ॥సం॥
కల్లులొట్టెలు బట్టి - కడుపునిండా త్రాగి
ఒళ్ళు పులకారింప - ఊగీసలాడ్దాము॥సం॥
తల్లి కెట్టిన సొమ్ము - చెల్లీకెట్టిన సారి
ఎల్లకాలంకూడ — యిలమీ దుంటుందంట॥
సంతోసమున........

(అనిసంతోషంతో, బలులునిచ్చుటకై ప్రియత్నములు చేస్తుంటారు: అదే సమయమునకు రామారావు సాధువరూపముతో నటకు వచ్చి. యీ దృశ్యమును కాంచి వారించుచు)

రా:-సోదరులారా! ఆగుడు ఆగుడు....ఎన్నిజంతువులు! హరి హరీ! వీనినన్నిటిని బలికొరకేనా?

ఒక: ఏట్రావాడు? బొమ్మనంట్రా!

రా:-నాయనా! పోవుదును గాని, ఒకసారి, ఒక్కసారి మాత్రము వాటి మొగము చూడండి.

చ॥ జల జల నశ్రుతోయములు జారుచునుండగ, మీర లిట్టులఙ్గలకల నవ్వుచున్ మిగులగంతులు వైచుచు, నోరులేని, మేకల, మఱి కోడిపిల్లల, నిగారపు బెద్దుల దున్నపోతులన్ బలి యొనరింపగా దగునే? బాపురె! దానవు లట్లు సోదరుల్

నాయనా! వీటిమీద మీ కింత నిర్దయ యేల? బుద్ధబోధ దలచి యీ దురాచారము మానుడు.

ఇంకొ:-(నవ్వుచూ) దురాచారాలట! బుద్ధుడట!! బోధలట!!! హెహ్హె హ్హె!....బొమ్మన్రా చవటసన్నాసిని! ఈడితోనేటి. మన

పని కానియ్యండహే. (మేకలను విప్పుచుండగా! రామారావు అడ్డు పడి)

రా:-సోదరులారా! నాప్రార్థన మన్నింపుడు. ఈజంతుబలుల నాపుడు. (కృష్ణారావు దగ్గరదగ్గరగా వచ్చును. అటునుండి గోపాలరావును వచ్చును) మనకు సౌఖ్యము కలుగుతుందనే వెఱ్ఱిభ్రమ కొఱకు, మనవిలాసము కొఱకు, నేమియు నెరుగని జీవులను విశసించ డము మనకు శ్రేయస్కరమా! ఆలోచింపుడు. సోదరులారా! మీ యజ్ఞానాంధకారమును పోద్రోలి, మీ జ్ఞాన నేత్రములను దెఱచి వెనుక కొకసారి చూచుకొని ఆలోచింపుడు. ఇతరజీవ ములను బాధించినగాని, మీయాత్మ సంతృప్తికాదా? గౌరితల్లి సంతసింపదా ?

సీ॥ కోడిపుంజుల లేతగొంతుకల్ యీతల్లి
ఆసించెనా మిమ్ము ? నయ్యలార!
జీవతతిని బ్రీతి జేది ప్రోచెడితల్లి
గొఱ్ఱెల కుత్తుకల్ కోరెనొక్కొ!
చిరజీవు లగుచిరంజీవుల జీవిత
ములనిమ్మటంచును దెలిపె నొక్కొ
కలలోన గన్పడి గౌరీమహాదేవి
ప్రస్తుతించెనె మిమ్ము బలులకొఱకు!
గీ॥ ఏదియును లేదు ; కనగ మన మోదమునకె
జేయుచున్నార మిట్టి దుష్కృత్యములను :
"ఆత్మవత్సర్వ భూతాని" యను బుధోక్తి
తలపవలె గాని సుంతయు దయయు లేక.
బాధపెట్టుట దగునె నా భ్రాతలార!!!
కావున నామాట విని, యీదురాచారము మాన వేడెద.

నాయకు:—(లేచి) అవున్రా! బాబుచెప్పింది నిజమేరా! ఇంక మనం

బలులెయ్యేస్తురా ! బాబుగారూ! రక్షించండి, ఇంకెప్పుడు ఇలాటి పనులు చెయ్యము - అమ్మసాక్షి చేస్తే !

రా:-(సంతసమున) మంచిది, నాయనలారా ! ఇక, మీరీయత్నమును విరమించి పోయిరండి. (వారట్లు ఆచరించి చనుదురు.)

కృ:-ఇదిగో ! గోపాలరావుగారా ! రండి మీకొరకే చూస్తున్నాను.

రామా:-

[పాట-ప్రబోధము]

నమ్మకు మేరిని నమ్మిన మోసము
సుమ్మిది నమ్ముము జీవా !
ఇమ్ముగ విను నా హితవాక్యంబుల
సమ్మతి మతిపై జీవా ॥ ॥1
మాయ యీజగతి, మాయ యీనరులు
మాయయె సర్వము జీవా !
హేయమైన నీ హీనపు బుద్ధుల !
ద్రోయుము వేగమే జీవా !! ॥2
కన్నును మిన్నును గానక దిరిగిన
కడ కేమవునో ? జీవా !
మన్ను మన్నులో గలసెడివఱకౌ
వెన్నుని గొలువుము జీవా !

(అని బోధసేయుచు కృష్ణారావు, గోపాలరావులను దాటి పోవును.)

కృ:—(ఆదిక్కుగానే చూచుచు) ఆహా ! ఏమిబోధ ! ఎంత చక్కగా బోధించుచున్నాడు. ఆహా !........

గో:—(నవ్వుచు) ఓహో ! యేమిబోధ ? లేవండి కృష్ణారావు గారూ ! మీకేం మతిపోయినదా ? ఏదీ ఏడవకపోతె యీరోజు లలో కూడెవరు పెట్టుదురు ? వాడిగోల మనకేల రండి.

(ఇంటిలోపలకు వచ్చెదరు. లలితయు గోపాలరావుకి తగిన విధముగా మర్యాద చేస్తుంది. గోపాలరావు ఆమెపైపు తనమోహదృక్కులు బరపించును. ఆమె భయపడియు, ధైర్యముతో జూచియు జూడక నట్లుంటుంది. ఇంతలో కృష్ణారావు దుస్తులు పైమకొని వచ్చి )

కృ:—క్షమింపుడు ఆలస్యమునకు ; రండి ఇక వెళ్లెదము. [గోపారావు కృష్ణారావులు బయటకు బోవుదురు.]

లలి:—వీనిప్రవర్తన జూడగా గామాంధునివలె గన్పడుచున్నాడు. ఏభయమును గలుగదుగదా !

(గోపాలరావు భార్య శాంత ప్రవేశం)

ల:—(లేచి) వదినగారా ! రండి, కూర్చోండా కుర్చీమీద.

శాం:—(కూర్చుండి) అమ్మాయీ ! ఇపుడాయిరువురు నెచటికి బయలు దేరినారో నీకేమైన దెలియునా !

లలి:—గోపాలరావు అన్నగారు మీసోదరునికి ఏదో ఉద్యోగము చూపించెదనని అన్నారట ! అందుకొఱకే నని నే నూహించుచున్నాను.

శాం:—ఆహా ! మంచిదే కాని, లలితా ! ఒకమాట ; నీయన్నగారు మధుపాన ప్రియులు ; జూదప్రియులు ; మఱియు వేశ్యాప్రియులు కావుననే,

సీ॥ సాలు సాలున బదివేల రూపాయలు
వచ్చుభూములు వేశ్యవలన బోయె ;
నవ్య మైనట్టి రెండంతస్తులుగల మే
డలు రెండు నావేశ్యవలన బోయె ;
ఫల పుష్ప భరితమై కలకలలాడు తో
టలుగూడ నావేశ్యవలన బోయె ;
నవిగాక నా మేని యాభరణములు స
ర్వముగూడ నావేశ్యవలన బోయె ;

గీ॥ నటుల వైభవమంతయు నంతరించె;
నేమి చెప్పుదు నాదు నిజేశ్వరుండు ;
మాయలాడగు నా వేశ్యమహిమవలన
నలుపుచున్నట్టి కృత్యముల్ లలిత ! నీకు॥

లలి:—(అదరిపడి) అట్లనా ? మీసోదరునిగూడ నిట్లే తయారుకావిం పరుగదా ?

శా:—అంతియేకే గదా ! మున్ముందటి నిన్ను మేల్కొల్పుట? నేను చెడినదిగాక, నీవంటి సంపన్న గృహస్తురాలిని చెరుపగల్గుదునా?

లలి:—అమ్మా ! సీవీ విధముగా బోధించుట యెంతయు ముదావహము. ఇంకో సంగతి. ఇప్పుడు వెళ్లినప్పుడు; నాపై నేవో కఠోర దృక్కులు పఱపించినారు. భయముగూడ వేసినది. తల్లీ నాకే భయములేకుండ చూడు!

శాం:—అంతవరకుగూడ వచ్చినదా ! ఆహా ! పరమేశ్వరా !

సీ॥ తల్లిదండ్రుల మాట దలదాల్చి సతతంబు
కడు విధేయతతోడ గ్రాలువాడు
తనకు గలిగినయంత దయతోడ బేద సా
దల నెల్ల దన్పుచు దనరువాడు
సత్య దయా శౌచ సద్గుణంబుల నెల్ల
మించిన దయను పోషించు వాడు ?
ధనికప్రపంచంబునను యెనలేని సా
టిని గని ఘనమును గనినవాడు

గీ॥ నైన మత్ప్రాణకాంతుని నకట ! ఒక్క
సాని చేతులో కీల్బొమ్మగా నిలిపితె ?
దీన మరియాద గలస్త్రీల మానములను
జెరుప నుంకించుచుండెగా సిగ్గులేక.

లలితా! నాశక్తినంతయు ధారపోసియైనను నీకేహానియు గలుగకుండ చూచుచుండెదను. నీవు మాత్రము నీ స్వామిని రక్షించుకొనుము. తరువాత విచారించిన లాభములేదు. (పోవును)

ల:—ఇదియేమి దురవస్థ........కానిమ్ము........అన్నిటికి నడ్డుపడు వాడు లేడా పైన?

— తెర —



# స్వర్గ భూమి

తృతీయాంకము—తృతీయరంగము.



):( ప్రదేశము-కళావంతులవీథి-ప్రవేశము-గోపాల-కృష్ణారావులు ):(

కృ:—గోపాలరావుగారూ! ఈ వీధి కళావంతుల వీధివలె నున్నదే!
గో:—అవును సత్యమునే గ్రహించినారు. ఎట్లైనా........
కృ:—మఱి. మనము వచ్చినకార్యమున కీదారితో బనికలదా ఏమి?
గో:—అవును ఈదారి వెంబడినే బజారునకు వెళ్లవలయును. మీరేమైన సంశయించుచుండిరా!
కృ:—అబ్బే! నాకే సంశయము లేదు.
గో:—అదిగో! ఆమేడ నాచిన్ననాటి స్నేహితురాలిది. చాల అందకత్తె; విద్యావతిని.
కృ:—ఉఁ హూఁ....
గో:—అదిగో! అరుగుమీదనే యున్నట్లున్నది.

( ఇరువురు నామేడ సమీపించుదురు. )

కాం—(వారిని జూచి) ఇదిగో గోపాలరావుగారా, నమస్కారము బహు కాల దర్శనము. ఎక్కడికో బయలుదేరినట్లుంది? దయచేయండి లోపలకు.

గో: — చిరునగవుస) చిత్తము. బజారునకు వెళ్లవలసిన పనియుం డుటచే బయలుదేరితిమి మరల వచ్చెదములే!

కృ:—(తనలో) ఆహా! ఏమి యీ సుందరాంగి యౌవ్వనబింకము! లలితయే సుందరాంగి అనుకొంటిని. ఆమెకంటె నీమె వేయిరెట్లు సౌందర్యవతి గదా! ఆహా!

గీ॥ అతివ గాదిది మారునిసతియె గాని,
కలికి గాదిది చిలుకలకొలికి గాని,
చెలువ గాదిది సుమబాణుములికి గాని,
వహ్వారే! దీని వర్ణింప వశమె? నాకు.

కాం:—ఏమి కొంచెముసేపు కూర్చుండి పోవుటకే వీలులేదుకా బోలు? పోనీ లెండి ఎంతైనా మేము........

గో:—అబ్బే! అటువంటి దేమీకాదు. వీరి పనిమీద వెళ్లుచుంటిమి అందుచేత.... ....

కాం:—ఊహూఁ!.... వారియాటంక మనియా?

కృ:—నాయాటంక మేమియు లేదు వారియిష్టమే.

గో:—సరిసరి నాయడ్డేమిటి? పద వచ్చెదము.

—(లోపలకు పోవుచుండగా రామారావు సాధువు వేషమున ప్రవేశము)—

[ పాట ప్రబోధము: ]

సుజ్ఞానివిగదా! అజ్ఞానమ్మున
సుడివడ నేలనె జీవా!
విజ్ఞానార్కుని విమల తేజమును
వేడ్క భజింపుము జీవా!!

మందర గలిగెడి ముప్పు దలంపక
తొందర పడకే జీవా !
మందబుద్ధివై మన సీయకుమా
మదనోన్మాదివె జీవా !!

— ( వారిముందనుంచి పాడుకొనుచు పోవును ) —

గో:—(తనలో) వీ డెప్పుడును మాచుట్టును దిరుగుచుండు నేమి ? (లోపలికి పోవుదురు.)

కాం:—ఈకుర్చీల మీద కూర్చుండి, కాస్త విశ్రాంతి........

గో:—చిత్తము....అటు గూర్చోండి కృష్ణారావుగారూ !

కాం:—గోపాలరావుగారూ ! వీ రెవరండీ ?

గో:—వీరిది. రాజమండ్రి ; ఆగర్భశ్రీమంతులు బి. ఏ. వరకు చదువుకున్నారట ! "ఉద్యోగమ్ పురుష లక్షణమ్" అనిగదా ! వీరిక్కడకు ఉద్యోగపు రీత్యా వచ్చినారు. పనిమీద నిటు వెళ్లుచుండగా నీచే నాహ్వానింప బడితిమి. కాబట్టి వచ్చినందుకు గాను ఒక్కసారి....నీ గానము........

కాంచ:—గానమా ! నాకేమి వచ్చునండి. నేనే మంత విద్యావతినా?

గో:—లతా ! నీ వట్లనకూడదు. ఏమందువా ?

గీ॥ చదువునందున, సకల సంపదలయందు
జక్కదనమున, బేర్గాంచి, నిక్కు లేక
సంచరించుచు నీ వేశ్యజాతియందు
ఖ్యాతి గాంచితి వీవెగా ! కాంచనలత.

కావున నిక వేరు మాటాడక కంఠము సవరించుకొనుము. (కృష్ణారావును గాంచి) మీరు చెప్పినగాని, తనగానము మనకు వినిపింపదు కాబోలునండి !

కృ:—నాయుద్దేశముకూడా నదియే ఏదో ముచ్చట యుండుననియే గదా ! ఇట్లు వచ్చుట ; [కాంచనలత జూచి చిరునవ్వు]

కాం:—

....[ అనుబంధము నెం. 8 ]....

కృ:—ఆహా! ఏమిగానము! చక్కగా బాడితివి.

గో:—వహ్వా! శ్రీకృష్ణుని మురళీ గానమునకే వలచి భర్తనుగూడ వీడి వచ్చితివా?

కాం:—హేళన చేయుచున్నారు కదూ!

గో:—నీగానము మాత్రము చాలాబాగుగా నున్నది. కాని పాటయర్థము మాత్రం నాకు నచ్చలేదు.

కృ:—నాకు సరిగానే నచ్చినది. ఏమందురా? "భక్తి ప్రేమలు ఎవ్వరియందు లీనమగునో వారలమీద మమకారము మెండు" అను మాట మనము వినుటలేదా? చూడుడు.

గీ॥ తొల్లి మోహినియు నమృతం బెల్ల సురల
కర్పణము చేసి, యసురుల దర్పమెల్ల
దీర్చునటు; లీమె తనప్రేమ తృష్ణ నెల్ల
కృష్ణ కర్పించి పోద్రోలె కృష్ణసుతుని.

కావున నీమె గీతము నాకు సమంజసమే.

గో:—అవుననియే తోచుచున్నది. ఎట్లయినా ఈమెను మీరు వెనుక బెట్టుకొని వచ్చుచున్నారండీ!

కృ:—లేదు; లేదు. వాస్తవము వక్కాణించితిని.

గో:—సరిలెండి దానికేమి? మనము వచ్చినపని మఱచి పోయితిమి చాల తడవైనది పోవుదము రండు.

కాం:—ఆఁ పోవుదురుగాని తొందరలేదులెండి మీరు నాసర్వస్వమును జూచితిరి గదా! ఇక వీరికి జూపింపవలదా?

కృ:—(చిరునగవున) సర్వస్వమునా? — అనగా?

కాం:—అనగా—నాతోట, ఆట, పాట, యిల్లు యిత్యాదులు అంత కంటె నావద్ద నేమిగలదు ?

గో:—లేకేమి ? మంచి యౌవనము ఉన్నదిగదా ! (నవ్వుదురు)

కాం:—ఊరుకోండి, మీపరిహాసములకేమి ? కృష్ణారావుగారూ ! లెవండి ఉద్యానవన విహారమునకు! (చేతులు పట్టుకొని పోవును)

గో:—అమ్మయ్య ! ఇప్పటికి జరుగవలసినది జరిగినది. పైకార్యము గూడ సందర్భానుసారముగా నదియే జరుగగలదు. ఇక నేనెం దుల కిక్కడ ?

— తెర —



# స్వర్గభూమి

## తృతీయాంకము - చతుర్థరంగము

—[ ప్రదేశము-శ్రీధరరావు మందిరం-ప్రవేశము-పద్మ ]—

పద్మ:—ఆహా ! నాబ్రతు కెంతపాపిష్టి బ్రతుకు ? పరమేశ్వరా ! నీవిట్లు కడగంట నరయుట తగునా ? ఇకనైనను నీకైలాటక మును గట్టిపెట్టవా ?

( అనుబంధము నె. 9 )

—. ప్రవేశం-కామేశ్వరి . —

పద్మ:—(చెల్లెలు రాకగాంచి కళ్ళు ఒత్తుకొనును)

కా:—అక్కా ! నాన్నగారిచ్చిన యుత్తరము చూచేవా ? ఏమని యున్నది ? ఎక్కడనుండి ?

పద్మ:—అది రామంబావ దగ్గరనుండి సంగతులేమున్నవి? అంతయు తారుమారగుచున్నది. అంతా నాకర్మము.

కా:—ఏమే అక్కా ! ఏమనివ్రాసినాడు రామం బావ !
పద్మ:—ఏమున్నది అక్కడకు తీసుకొనిపోయిన లలితనుగూడ నావ లెనే దిక్కుమాలినదానిగా చేసి భోగముదానితో దిరుగుచున్నాడట !
కా:—అబ్బా ! ఎంతసాహస కృత్యము! మఱి అక్కా ! బావకు డబ్బెట్లా వస్తుందే ?
పద్మ:—ఆ లలిత ఎత్తుకొని వచ్చిన 10 వేల రూపాయలు ఉన్నవి గదా ?
కా:—లలిత ఇచ్చునా మఱి! తనను ఇలాచేసినాడని కోపం రాలేదూ?
పద్మ:—వచ్చినమాత్రి మేమిచేయును ? పొరుగూరు గదా ! అదిగాక "మోజు" అడ్డుచెప్పునా ?
కా:—అధనమంతయు నయిపోయినగాని, ఇంటికి రాడే బావ !
పద్మ:—ఈసారి నదియు నయిపోవును. వేశ్యాసంపర్కము కలిగినది కదా ! దానికి తోడు జూదము, త్రాగుడు నలువాటయిందట.
కా:— సరి సరి, అన్ని లక్షణాలు అలవడ్డవీ !
పద్మ:—దీనికేమిలే, ఈ వేశ్యాజాతిని నమ్మకూడదు. ధనమంతయు నపహరించి యావలకు గెంటుదురు. అదియును గాక........
కా:—కాక........కాక యేమే అక్కా !
పద్మ:—ఉన్న ధనమంతయు జిక్కుట కేదేని యవకాశము దొఱకిన చంపివేయుదురు ?
కా:—అది సాధ్యమటే నీపిచ్చికాని.
పద్మ:—పిచ్చిపిల్ల ! కాకేమి ? ఎన్నియో జరుగుచుండును ; రెండవ కంటికి తెలియకుండ.
కా:—యెవరి చేతనైనా కొట్టించి చంపించుదురా ?
పద్మ:—అట్లును జేయవచ్చును మఱియు,

గీ॥ వస్త్రములయందు, భూషణావళులయందు
పడకగదులందు నిత్యంబు కుడుచుమందు

నన్నపానీయములయందు నన్యులకును
గానరాకుండ విషమును గలుపుచుంద్రు.

అని పెద్దలందురు. అట్లును చేయవచ్చును. మఱియు వారేగాని తలంచిన ఎట్లయిన చేయుదురు.

కా:—అవును అందుకే కాబోలు "ధనాశ, పిశాచపు పనులు చేయించుచుండు" నందురు.

[ ఇంతలో లోననుండి రామేశ్వరి! అనిపిలుపు ]

కా:—ఆఁ వస్తున్నాను. (పోవును)

పద్మ:—ఆహా! ఇప్పుడేమి చేయుదును? ఏమిచేసిన నా నాథుని పొందగలుగుదును (అటునిటు దిరుగుచు) పోనీ నేనుగూడ అక్కడకు బోయిన, రామారావు బావకు నేదేని సాయము చేసినదాననగుదునేమో!........అదియే యుక్తము. నాన్నగారొప్పుకొనెదరా? ఒప్పరు; గత్యంతరము........హుం........

... తెర ...

# ఆ రాత్రి

(ప్రదేశము-పడకగది-ప్రవేశము-పద్మావతి-రామేశ్వరి)

(రామేశ్వరి నిదురబోవుచుండును, పద్మావతికి నిదురరాక ఏదియో నాలోచించుచు నటు నిటు దిరుగుచుండును.)

పద్మ:—(కొంత సేపటు నిటు దిరిగి తనయభిప్రాయమును చెల్లెలకు దెల్ప నిశ్చయించుకొని) చెల్లీ! చెల్లీ ........

కా:—(లేచి) ఆఁ ఏమి? ఏమే అక్కా!........నీవింకను నిద్దుర పోలేదే? ఎందుకు లేపేవు?

పద్మ:—నిద్ర వచ్చుటలేదమ్మా! కాని, యిటు గూర్చుండుము. నీతోనొక సంగతి చెప్పెదను (కూర్చుడును)

కా:—ఏమిటే ఆసంగతి........

పద్మ:—చెప్పెదను కాని, ఆసంగతి నీవిప్పుడు ఎవరికి తెలియజేయ కూడదుసుమా! నామీద ఒట్టుసుమా! చెప్పినావంటే....?

కా:—(ఆలోచించుచు) సరియే! ఏమిటది?

పద్మ:—(కురులు దువ్వుచు) చూడు కాముడూ! నేను రామంబావ దగ్గరకువెళ్లి, రామంబావయు నేను కలిసి నీ బావను ఆవేశ్యకూపమునుండి బయటకు దీయుట కేదైన చేయుదమని యున్నది.

కా:—నాన్నగారితో జెప్పకుండగనే వెళ్లెదవా?

పద్మ:—చెప్పినచో వెళ్లనీయరమ్మా "అక్కడ నీవలన నేమిజరుగును తల్లీ!" అని ఆపుచేస్తారు.

కా:—అవును, అదిగాక, పొరుగూరు....చాల కష్టములు..........

పద్మ:—(ఆవేశంతో) కష్టములు....కష్టములమాట కేమి లెమ్ము ఎన్నికష్టములు బడియైనను సరే, మన హైందవస్త్రీలెల్లరు దమభర్తలు యవినీతులుగా దిరుగుచున్నప్పుడు, మరల వారిని సునీతులుగా దిరుగుటకు యత్నింప వలయునుగదా। అది వారి విధ్యుక్త ధర్మము గదా? కష్టములని మానుట తగునా? ప్రాణములనైన నీయవలసినదే.

కా:—అవును కాదనను.......కాని, నన్నేమి చేయమందువు?

పద్మ:—నేనిప్పుడొక యుత్తరము వ్రాసి నీకిచ్చెదను అది పొద్దుట నాన్నగారికి ఇమ్ము; నేను లేచునప్పటికి ఇది ప్రక్కలోనున్నదని చెప్పు.

కా:—నీవెప్పుడు వెళ్ళెదవు? బావదగ్గఱకు.

పద్మ:—నేనీ రాత్రియే ఇప్పుడు వచ్చే నాలుగు గంటల బండిమీద.

కా:—అబ్బా! చీకటిలోనే భయం కాదే?

పద్మ—చెల్లీ ! యిప్పుడేగదా చెప్పితిని కష్టనష్టములకు, భయసందో హములకు నిటువంటి పట్ల తావు లేదని ? అదియునుగాక రహస్య ముగా పెంటడిని రమ్మని చెప్పేను. వాడొస్తానన్నాడు పాపము.

కా:—ఎప్పుడు మాటాడేవే వాడితో ? సరియే కాని, నీవెళ్లిన వెం టనే నాన్నగారికి టెలిగ్రాము యిస్తావు కదూ !

పద్మ:—ఆహా ! తప్పకుండా.

కా:—బట్టలేవియు సర్దుకొనలేదేమి ?

పద్మ:—ఇంతవరకును ఊరకుంటి ననుకొంటివా ? అన్నియు సర్దు కొన్నాను.

( ఇంతలో రహస్యముగా మెల్లగా కలుపులు తీసికొని పెంటడు వచ్చును )

కా:-రామంబావ ఎక్కడనున్నదియు నీకెట్లు తెలియును ?

పద్మ:-ఇదిగో ! ఈయుత్తరముమీది చిరునామా ? దీనిని బట్టి అదియే తెలియును.

కా:-సరియే.

(పద్మావతి చెల్లెలను వదలలేకవదలలేక వదలుచూ, ముద్దుపెట్టుకొని భయలుదేరును. పెంటడు పెట్టెవగయిరా పట్టుకొని వెంటాడును. ఒకముత్తైదువ 90 సంవత్సరములది నీటిబిందెతో ఎదురుగా వచ్చును శుభ సూచకము అయినదని సంతసమున స్టేషనుకు బయలుదేరుదురు.)

తెర



# స్వర్గ భూమి

## చతుర్థాంకము—ప్రథమ రంగము

. . ( ప్రదేశము-ఒకచిన్న మండువా-ప్రవేశము-రామారావు ) . .

రామ:-(ఆలోచతో నటు నిటు దిరుగుచు) ఏమియు తోచకున్నది. కృష్ణుడు నానాటికి జెడిపోవుటయేగాని, సరియైన మార్గము త్రొక్కుట కనబడుటలేదు. ఈ వేశ్యాసంపర్కమునకు తోడు త్రాగడము గూడ మరిగినట్లే తోచుచున్నది. (బయట బండిచప్పుడు)

రామ:-ఎవరది ? (బయటకు వచ్చును పద్మ బండి దిగుచుండును) పద్మా ? ఏమిటీరాక! ఒక్కతెవే వచ్చినట్లున్నదే! (లోపలకువచ్చి ఒకచోట గూర్చుండుదురు.)

రా:-పద్మా ! ఏమిటి సంగతి ? నీవొక్కతెవు వచ్చినావు ?

పద్మ:-సంగతికేమి గలదు ! నీ స్నేహితుని నేరీతిగా అయనను ఆ వేశ్యవద్దనుండి యుద్ధరించుటకు ? నా వలన నేమైన సహాయ ముండునేమో యని........

రామ:-మామయ్యతో జెప్పితివా ?

పద్మ:-లేదు కాని ప్రొద్దుట చెప్పుమని కాముడుతో చెప్పమన్నానుతే వచ్చేటప్పుడు.

రామ:-మంచిది నీమనస్సు యిట్లుమారినదేమి ? నీ పూనిక చాలకష్టతరము గదా ?

పద్మ:-అయిన గానిమ్ము మారుటకేమికలదు? కాలము మారుచున్నది కాంతలు మాత్రిం మారరా ?

రా:-కానిమ్మ ఇప్పుడతనికి దురలవాటులుకూడ బాగుగా నలవడినవి. ఎంత ప్రయత్నించినను ఏమిచేయుటకు నాకు దోచుటయే లేదు.

ప:-మరల వారికి గన్పడి ఏమయిన జెప్పితివా ?

రా:-ఆహా ! లక్ష పర్యాయములు.

క॥ చెప్పితిగా నయ భయముల ;
జెప్పితిగా గూడ దిట్టి చేష్టలు మనకున్
ఒప్పిదములు గావంచును ;
జెప్పితి నిక నెన్ని గతులచేతనో పద్మా !

కాని, ఏమియు లాభము లేకపోవుచున్నది.

పద్మ:—అట్లయిన మనకు గత్యంతరమేమి ?

రా:—(అటునిటు దిరుగుచు) అదియే ఆలోచింప వలయును.

ప:-వేషము ధరించిగాని, ఎట్లయినగాని దానింట నుండు నట్లాలోచించినచో మనకెప్పటి కప్పు డక్కడి సంగతులు తెలియును.

రా:-(పచారు చేయుచు) చూడు పద్మా ! బోగమువాళ్ళకు పూవులంటే మహా ప్రీతి కావున నావిధముగా యత్నించిన లాభము. ఏమందువు ?

పద్మ:-అవును. కాని, దారి !........

రా:—పుష్పము లమ్ముచూ బయలుదేరుడము, అది కొనుకొనునపుడు మంచి మాటలచే చనువు చేసుకొని దానింట బానిసవృత్తి చేపట్టడము; కృష్ణుని కంటికి మాత్రము కానరాకుండ తిరుగుచుండడము జరుగ వలయును.

ప:—అట్లయిన నొకపని చేయుదము.

రా:— ఏమది ?

ప:— నీవీ సాధువు రూపమున దిరుగుచుంటివి కాన నేను పుష్పము లమ్ముదానిగా మారుదును: రహస్యములున్న నిక్కడనే కలిసికొని మాటాడ కొనవచ్చును.

రా:—సరియే. నేనును అటు లలితమందిరమును, యిటునీవేశ్యామందిరమును జూచుచుందును. కాని నీకు చాల కష్టము గదా !

ప:— నాకే కష్టమును గలుగదు భారతస్త్రీ కథలు చదువలేదా ? వారికంటె నాకెక్కువయా ? వెఱ్ఱివానివలె మాటాడెద వేమి ! పైన దైవము లేడా ?

రామ:-ఏమి నీధైర్యము! నీ ధైర్యమే నీకుజయము.

ప:-ఈవేళనుండియే పని ప్రారంభించెదము.

రా:-నేటి కాగి నీప్రయాణపు బడలిక దీర్చుకొమ్ము. చాల దవ్వునుండి వచ్చితివి !........నేనటు వెళ్లివచ్చెదను మామయ్యకు టెలిగ్రామ్కూడ ఇచ్చి వచ్చెదను; తలుపులు వేసుకొనుము. (పోవును సాధువు రూపము ధరించి)

పద్మ:-(ఇల్లంతయు బరికించుచు ఒకచోట తాను రహస్యముగ దెచ్చుకొనిన కృష్ణవిగ్రహము నిలిపి, నిశ్చలమైన భక్తితో)

సీ॥ సుందరాకార ! మన్మందిరాభరణుడౌ
హృదయవల్లభు సేవ నేనె సేయ,
రాధికాలోల ! విరాజమానసు డైన
నా నిజేశ్వరు తోడ నేనె పలుక-
నీలవర్ణ ! సునీతుడై లలి జూపు మ
త్ప్రాణకాంతుని పొందు నేనె బడయ,
శ్యామసుందర ! మన్మనో మనో హరు డైన
జీవితేశ్వరు నేనె జేకొనంగ
గీ॥ పుష్పముల నమ్మదలచు నా పూన్కి గాంచి
తోడుపడుమోయి, నాస్వామి జోడు గూర్చి ;
నమ్మితిని నిన్నె చిన్నతనమ్ము నుండి
ఇందిరానాధ ! నవనీతహృదయ ! కృష్ణ !

దేవా ! నీవు నాపూన్కి నెరవేరునట్లు అనుగ్రహించి, తగిన బలము నొసంగి నానాధుని సేకూర్పుము. నీ నామధేయుడే యగుట చేత నిన్నే కొలుచుకొను చున్నాను తండ్రీ ! అనుగ్రహింపుము.

తెర

# స్వర్గ భూమి

## చతుర్థాంకము - ద్వితీయరంగము.

( ప్రదేశము-కాంచనలత మందిరము-ప్రవేశము-గోపాలరావు కాంచనలత )

గో:—కృష్ణారావు ఇంకను రాలేదు లతా !

కాం:—లేదు రాత్రియంతయు పేకాటలో మునిగిపోయినట్లున్నారు ? ఏమయినది?

గో:—పాపము కృష్ణారావుసొమ్మె పోయినది. కాని నీవు కూర్చొన లేదు కారణమేమి ?

కా:—శరీరమున బాగుగా లేనందున. దానికేమి ఆ సారాయివాళ్లి ఇక్కడ గోలపెట్టుచున్నారు. ఎవరిమట్టుకు వారూర్కొన్న నెట్లు?

గో:—ఎవ రూరుకున్నారు ? కృష్ణారావుకే నెమ్మదిగా మనసు విరిచి ఇయ్యాలి. ఒక 10 రోజులు గడువు.

( అనుబంధము 10 )

[ ఇంతలో బయట పాట ]

పుష్పముల ధరియించు హక్కు - పూర్తిగా గనుగొన్నచో నది
పూవుబోడుల సొమ్మెసుండి - ముదముతోడ, వేగరండీ
రండి, రండి, వేగరండి
లెండి, తొందరగా కొనండి ॥1

గో:—అదిగో నిన్నవచ్చిన పూలమ్మమనిషి. చాలబాగుగా బాడుచున్నది. మంచియౌవనములో గూడనున్నదిసుమా ! అందగత్తె కూడ.

కాం:—అవును. అంతటి సౌందర్యము గలవారు మావంశములో కూడ నుండరు. ఆమెను సర్వాభరణ భూషితురాలుగా........

గో:—చేసిన నీవెందుకును బనికిరావు కాని, ఆమెను మంచిమాటలచే నిక్కడకు జేర్పుదూ !

కాం:—(నవ్వుచు) నీవు కన్నెటికము చేయుదువా యేమి ?

గో:—(నవ్వుచు) దానికేమిలే అదిఒప్పుకొననిమ్ము.

కా:—అది ఎంతపని. మొదట దానియిష్టప్రకారముగా ఒప్పుకుంటే సరి ! తరువాత మనము చూచుకొన వచ్చును. స్త్రీయేగదా ! అలా ఉండి పోతుందా ?

గో:—అవును; నే నలావెళ్ళి కృష్ణారావును బిలుచుకొని వత్తును. ఈలోపున దానిని మంచి చేసికొనుము. (పోవును)

( మరల బయటనుండి పాట ) మారురూపమున పద్మ.

స్త్రీకి మోదము గల్గుపూలూ-స్త్రీకి శోభను గూర్చు పూలూ ;
స్త్రీకి నాథుని జేర్చు పూలూ ! - స్త్రీకి శ్రేయమునుమ్ము పూలూ ;
కాన వేగమె రండు రండిటు
కాంతలారా ! సమయ మిదియె ॥2

(కాంచనలత బయటకు వచ్చును)

చాలతెల్లగ నుండునవి యీచక్కనైన-మల్లెపూలూ,
పూలజాతులకెల్ల రాజుగ-ముచ్చటొాదవెడి మల్లెపూలూ !
మేటి వాసన లీను పూలూ
మేటి యీసంపంగి పూలూ!

ఇంతులకు చేమంతులివిగో ! సంతసంబున కొనగరండీ,
వంత గందురుసుండి తదుపరి, వనితలారా ! వేగరండీ,
చూడుడీ కనకాంబరములూ
వాడుడీ నీలాంబరములూ ॥పు॥4

కాం:—(దగ్గరకు రాగానే) ఏవీ ! పూలు చూడనీ ! ఇలాకూర్చో (కూర్చుండును పూవులను జూచుచు)మీ దీవూరేనా? నీ పేరేమి?

పద్మ:—కాదమ్మా ! ప్రస్తుతము మాత్రి మీయూరే; పేరు !........ ఈ వృత్తిలో దిగాక పుష్పగంధి అని పిలుస్తున్నారు.

కాం:-అసలు పేరు ?

ప:-ఏమయిన నేమండి. త్వరగా చూసుకోండి పూలు ?

కాం:-(వదనము గాంచుచు) నీమొఖం చూస్తే పూర్వం సుఖముగా జీవించిన దానివలెను, గొప్పకుటుంబములో దానివలెను గనబడు చున్నావు.

ప:-ఏమైన నేమి ? ఇప్పుడు హీనస్థితియే కదా !

కా:-నీభర్త ఏమాయెను ?

ప:-ఉన్నారు. ఆయన మోహదేవత ఉయ్యాలలో నూగుచు ఇంకొ సుందరి యింటిలో నున్నారు. అందుచేత నన్ను చూచుట మాని వైచినారు.

కా:-మీఆయన పేరు ?........ షోసీ: సిగ్గయిన యెడల.... (పూలు తీసుకొని, డబ్బుయిచ్చుచు) ప్రతిరోజును ఇలా పువ్వులు తెస్తావు కదూ !

ప:-ఆహా ! ఇది నా వృత్తియే కదా !

కా:-చూడు....ఎవరు....పుష్పగంధీ ! నాకు పూలు గ్రుచ్చు పెట్టుటకు, కాఫీ కాచుటకు, తీరిక సమయములందు మాటలు చెప్పుటకు, ఒక మనిషి కావాలి నీవేమైన చూడగలవా ?

ప:-అలాగే నమ్మా ! (పోబోవును)

కా:-మాట! చూడు? నీవీవిధంగా నీయందమైన శరీరాన్ని కందిపోయే టట్లు తిరిగి పాడుచేసికోక పోతేనేమి ? నాదగ్గర నుండకూడదూ! సోదరిలాగ చూచుకొంటాను.

ప:-ఉండుటకేమీ లేదు కాని........

కా:-కాని ఏమి ? నీ ఉద్దేశమేమిటి ?........

ప:-ఇక్కడకు పదిమందియు వచ్చుచుందురేమో! ఏమో ఎవరు చెప్ప గలరు ? ఎవరిమనసు ఎటువంటిదో !

కా:-దానికేమీ సంశయింపకు; మగవారికంటనైన బడవలదు. అట్టి చోటకు నీవు రావలదు.

ప:-ఉచ్ఛిష్టకార్యము లేమియు జెప్పగూడదుసుమా !
కా:-అలాగే....నాకుపువ్వులు దండగుచ్చుట ; తలదువ్వుట ; కాఫీ
కాచుట తప్ప నిన్నింకొకపనికి నియమించను సరా !
పద్మ:-అట్లయిన సరియే. రేపటినుండి ప్రవేశించెదను.
కా:-ఆలాగే !
పద్మ:-సెలవు

తెర



## స్వర్గ భూమి

### చతుర్థాంకము—తృతీయరంగము.

(ప్రదేశము-రామారావు యిల్లు-ప్రవేశము-రామారావు, పద్మ.)

రా:-అట్లయిన రేపటినుండి ప్రవేశించెద వన్నమాట.
పద్మ:-అవును. అక్కడనున్న మనికన్నివిధముల మేలుగదా !
రా:—అవును. కాని, కృష్ణునికంటమాత్రము బడిన ముప్పు గలుగునేమో ! తగిన మెలకువతో దిరుగుచుండుము.
పద్మ:—అట్లనే. కాని, నీవు లలితవద్దకు పోయెద నంటివి. పోయితివా ? ఏమయినది ?

రా:—వెడలితిని. పాపము ! ఆమెయును చాల విచారించుచున్నది. నేను సాధువురూపముతోనే పోయితిని. చేయి చూడమంటే.... చూచినట్లు నటించి నాల్గుమాటలు చెప్పితిని. "కృష్ణుడు నావంకకు మఱలునట్లు ఏదేని మందునిమ్ము" అని బ్రతిమాలినది. నే నందులకు సరియే నంటిని.

పద్మ:—ఉహుం—నీవేమైన నిచ్చెదవా ! ఇప్పుడు ?

రా:—(నవ్వుచు) ఇచ్చుట కేమున్నది ? ఏదో వేరు యిచ్చి, యిది నిద్రపోవునప్పుడు కాళ్ళకు కట్టుమని చెప్పెదను.

పద్మ:—(ఆతురమున) దానివలన మోసము రాదుగదా !

రా:—అది సరియైన వేరునుగాదు ; ఆమె కట్టునదియును లేదు. ఇంతకూ కృష్ణుడచట నిద్రించడుకూడ. నీకెందు కింత భయము?

పద్మ:—సరియే.

రా:—కాని, ఒకసంగతి ; నీవు దానియింటిలో నుండుటయే కాదు ! ఆ యింటిలోగల సకల మర్మములును తెలిసికొనవలెను. మూలు త్రోవలుగాని, రహస్యబిలములు గాని - ఆఁ.... ఇంకొకటి ; ఆ యింటి పెరటితల్పులు ఎప్పుడును తెఱచియేయుంచుము. నా రాకపోకల కనుకూలముగా నుండును.

పద్మ:—మంచిది. ఇక నేను వెడలివచ్చెదను.

రా:—సరే. మెలకువతో నుండుమని యింకొకసారి చెప్పుచున్నాను. నేనును అటు లలితమందిరమున కేగెదను.

... తెర ...



# స్వర్గ భూమి

## పంచమాంకము—ప్రథమ రంగము

[ప్రదేశము: గోపాలరావుమందిరము, ప్రవేశము: లలిత]

లలిత;—ఆహా ! స్వర్గతుల్యముగానుండు గృహమును, విద్యాబుద్ధులను జెప్పించిన పూజ్య తలిదండ్రులను, చిననాఁటినుంచి నన్నే నమ్మి ఆశించియున్న బావ వెంకటరావును వీడి, ఈ దౌర్భాగ్యుఁడగు కృష్ణారావుతో లేచివచ్చినందులకు నాకు తగినశిక్షయే భగవంతుడు విధించినాడు. కృష్ణ డీరీతిగా మోసగించునని కలలో గూడ దలంచనయితినే ! ఇప్పుడెట్లు? నే నీ ప్రపంచమున నిక నెవరికడకు పోవుదును? తలిదండ్రుల నేముఖమున గాంతును? ఆహా! పరమేశ్వరా ! నా కావరమునకు తగినరీతి కావించితివి ?

....[ అనుబంధము నెం. 11 ]....

[ప్రవేశము :- గోపాలరావుభార్య శాంత.]

శాంత:- ఎందుల కమ్మా ! ఇట్లు సదా విచారించుట ? జరిగినదేదో జరిగినది. ఇంక పైకార్యము చూడవమ్మా ?

లలి:- చూచున దింకేమి గలదు నూయో, గొయ్యో తప్పించి ?....
ఇంతజరిగిన పిదప నింటికిమాత్ర మెట్లు పోగలను ?

శాం:- నీ తలిదండ్రులనే యిక్కడకు రప్పించుమమ్మా ! జరిగిన పరిస్థితులు సావధానముగా బోధించవచ్చును.

లలి:- నాకిక వారలను శ్రమింప జేయుట కిష్టము లేదు. నా మూలమున నిదివఱకే వంశమర్యాద సెడినది. మరల నిక నెందులకు? ఆహా ! నా చరిత్ర నాకే నవ్వు గలిగించుచున్నది !

గీ॥ సాంప్రదాయంబు గలయింట జనన మొంది
విద్యలను బొంది తుద కేను వెట్టి నగుచు

కామ మనియెడి పైశాచికమ్ము వలన
నిట్టులైతిని నా జీవమేల నింక !

శాం:- ఊఱకొనుము. సర్వము పూర్వజన్మసుకృతము.

[వీథిలో రామారావు - సాధుపురూపమున] ప్రవేశము-పాట.

తొలిజన్మంబున కలిగిన పాపపు
ఫలితము దప్పునె జీవా !
అలుగకు కష్టంబులు కలిగెను యని:
నిలుపవు సుమ్మివి జీవా ! ॥౧॥

శాంత:- నిన్నవచ్చిన సాధువు. తీసికొని వచ్చెద. (పోవును.)

[రామారావు పాట]

చింతిలి మనము చేయున దేమిటి ?
వంత వహింపకు జీవా !
సంతాపము విడి సంతసమతివై
సల్పుము పైపని జీవా ! ॥౨॥

చెప్పిన దెల్లను జేయుచునుందుము
ఎప్పగిదిగనో జీవా !
తప్పకు మీ నుడి, తప్పిన మోసము
యిప్పుడె కలుగును జీవా ! ॥౩॥

[శాంత రామారావుతో ప్రవేశము]

లలి:-(నమస్కరించి) స్వామీ, మూలిక తెచ్చితిరా ?

రా:- ఆహా !....(సంచినుండి ఏదియో మూలికదీసి) ఇది నీభర్త పవళించునపుడు ఎడమపాదము చిటికెనవ్రేలుకు గట్టుము.

లలి:- మంచిది ; మరల నిది ఉదయము విప్పివేయవలయునా !

రా:- అవును, ఇది కట్టిన సంగతి, విప్పిన సంగతి అతనికి తెలియ నీయరాదు.

లలి:- మంచి దటులనే. మరల తమరాక ?

రా:- నే నెప్పుడు యిటునటు దిరుగుచునే యుందును. మరల రేపు వచ్చెదను. నేను వచ్చినను రాకున్నను నీమూలిక మాత్రిము మూడురాత్రులు కట్టుము, మఱువకుము.

లలి: మంచిది.

తెర

ంంం

## స్వర్గభూమి

### పంచమాంకము - ద్వితీయరంగము.

—(ప్రదేశము-కాంచనలత మందిరము-యుద్యానవనము-ప్రవేశము పద్మ)—

—•పద్మ పూవులన్నియు కోసి దండలుగా గుచ్చుచు•—

( అనుబంధము నెం. 12)

——[....కాంచనలత-ప్రవేశము....]——

కాం:—పుష్పగంధీ ! నీవేనా పాడుచున్నది ! ఆహా! యీవనములో నింకెవరో పాడుచున్నారనుకొంటిని: ఎంతశ్రావ్యముగా పాడితివి? కృష్ణారావుగారును సంతసించిరి నీపాట విని.... అదుగో వచ్చు చున్నారు.

కృ:—(నిద్దుర ముఖముతో వచ్చును)

పద్మ:—(ముఖము కనబడకుండ దాచుకొనును)

కృ:—పుష్పగంధీ ! ఆహా ! నీపేరెంత చక్కనిదో నీగానమునంత చక్కనిది. నీగానము తల్లిలేపినట్లు నన్ను నిద్దురనుండి లేపినది.

కాం:—అవును........కాని, మీరు ముఖము కడుగుకొనిరండి....
కాఫీ కాచావా పుష్పం:
పద్మ:—లేదు, మొగము కడుగుకొనునప్పటికి యిచ్చెదను (పోవును)
కా:—రండి మొగము కడుకొని రండి.
(కృష్ణుడు మొఖము కడుగుకొనుచుండును, కాంచనలత వనములో తిరుగుచుండును.)
( అనుబంధము నెం 13 )

(పద్మ వచ్చి: "ఎవరోవచ్చి"రని చెప్పు, కాంచనలత వచ్చి తలుపు తీయును. గోపాలరావు లోపలకువచ్చును:—లోననుండి కృష్ణారావు వచ్చును. ఒకచోట కూర్చుందురు.)

పద్మ:—(లోననుండియే) కాఫీ తయారయినదమ్మా !
( కాంచనలత పోయి, తెచ్చును ముగ్గురు త్రాగుదురు. )

కృ:—నే నొకసారి యింటికి వెళ్ళి వచ్చెదను. మాటలాడుచుండుడు. (పోవును)
(పద్మ రహస్యముగా వారిసంభాషణ వినుచుండును)
కాం:—ఏమిది దొరగారు పొద్దుటే దయచేసారు ?
గో:—ఏమీలేదు నీతో నొక రహస్య విషయమును గురించి మాటాడాలి.
కాం:—ఉఁ....సిద్ధముగా నున్నానుగదా !
గో:—పుష్పగంధియు వినకూడదు. మనము లోపలికి పోవుదము రమ్ము:- (లోపలకుబోయి తలుపువైచుకుందురు. పద్మ వెన్నంటి వినుచుండును. రామారావు దొడ్డిగుమ్మము వెంట ప్రవేశము).
ప:— (నెమ్మదిగా) ఏమి యిటు వచ్చితివి? విశేషము లేమైన నున్నావా ?
రా:—(నెమ్మదిగా) లేవు. ఊరికె చూదామని వచ్చాను. యిక్కడ విశేషము........
ప:—(నెమ్మదిగ) ఉన్నవి. గోపాలరావు దీనితో రహస్యముగ ఏదో

మాటాడుచున్నాడు. రా : విందువుగాని (ఇద్దరు రహస్యముగా వినుచుందురు.)

( గదిలోపల కాంచనలత గోపాలరావులు )

గో:— లతా ! నే నీ ఋణబాధకు తాళలేకున్నాను. గత్యంతరమేమియు కనబడుటలేదు. కాబట్టి ఇందుకు తెగించితిని.

కాం:—ఆసమయములో నామెకు మెలుకువ వచ్చినచో ?

గో:—రివాల్వరు లేదా ? ఒకదెబ్బతో సరి.

కా:—నీయింట హత్యజరిగిన నీమీదకు రాదా ?

గో:—వెఱ్ఱిదానా ! చోరుల కృత్యముగా మార్చి వేదాము. పూర్వము చక్రపాణిని యిక్కడ లేకుండ చేయలేదా ! అంతకంటెనా యిది ?

కా:—అయిన యిప్పుడు నన్నేమి చేయుమందువు ?

గో:—ఏమియులేదు. కృష్ణారావు నీరాత్రి అక్కడకు పోయెదనన్నను ఏదోవంక పెట్టి యిక్కడనే యుంచు.

కా:—సరియే:—కృష్ణారావును ఏమిచేయవు కదా !

గో:—అబ్బే........రేపాసంగతి చెప్పెదను రాత్రి పనినిబట్టి.

కాం:—సరియే. రాత్రి వచ్చెదనన్నావు రాలేదేమి ?

గో:—ఇక్కడకనే బయలుదేరితిని కాని, దారిలో ఆబట్టలు కొట్టువాడు డబ్బు యివ్వలేదని జగడము పెంచినాడు: అది క్రమముగా తన్నులాట వరకైనది. అందుచేత రాలేకపోయితిని. మఱి యింక నేను వెళ్ళెదను 4 గంటలకు వచ్చెదను.

(రామారావు పద్మ గోపాలరావు వచ్చునని తోటలోనికి వత్తురు. గోపాలరావు పోవును.)

(తోటలో రామారావు పద్మలు)

రా:—పద్మా ! వింటివికదా ! ఎంత పయోముఖ విషకుంభములు వీరిరువును ? ఆ లలిత వస్తువులు దొంగిలిందామని కాబోలు:-

ప:—తఱితప్పివచ్చిన చంపివేయునటకదా !........ఏమిచేయుదువు?

రా:—అవును....పోలీసువారికిది తెలియజేసి పద్మపున్యూహముగా జేసి ఆ సమయములో పట్టించునట్లు చేసెదను.

పద్మ:—సరియే. ఏమైనసరే ఆమెప్రాణములు రక్షింపుము. 4 గంటలకు వచ్చెదనని చెప్పినాడుగదా. అప్పుడొకసారి నీవును రమ్ము.

రా:—అలాగే. నేనిక స్టేషనుకుబోయి వచ్చెదను. నీవు మాత్రము మఱువక సర్వము కనిపెట్టుము. కృష్ణుడిక్కడ నున్నయెడలనే ఇటువంటిపట్ల లాభమని తోచుచున్నది.

పద్మ:—అవును దైవమే యున్నాడు. నీవు వెళ్లిరమ్ము.

[రామారావు పోవును]

— తెర —

# స్వర్గ భూమి

## పంచమాంకము - తృతీయరంగము.

(ప్రదేశము-కళావంతుల వీధి-పాడుకొనుచూ. రామారావు (సాధువు రూపమున). అటునుండి గోపాలరావు కృష్ణారావులు ప్రవేశము.)

[రామారావు, పాట ప్రబోధము]

చెడుతలంపు మది చేరగనీయకు మిడుములు కల్గును జీవా !
కడకది మోసమె కల్గిన చిక్కులో బడిపోవుదువే; జీవా !! ॥1

అంగన మాటల నాత్మలో దలచి పొంగక బోకుము జీవా !
పొంగిన తుదకది కుఱ్ఱంగగజేయును లొంగకు దానికి జీవా ॥2

సంగతి నంతయు జక్కగ గన్గొని సల్పుచునుండుము జీవా !
సర్వము ఆలోచనయే లేకను సల్పగ బోకుము జీవా ! ॥3

( గోపాలరావు కృష్ణారావులు వానిని జూచుచు కాంచనలత యిల్లు జొచ్చెదురు)

రా:—వీరిరువురు లోన ప్రవేశించిరి. ఏమిజరుగునో చూతును. [దొడ్డి గుమ్మముగుండా లోనజొచ్చి రహస్యముగా నాలకించుచుండును]

( లోపల కాంచనలత గోపాల కృష్ణారావులు ప్రవేశము )

కాం:—నేడింత యాలస్యమైనదేమి ?

కృ:—ఆలస్యమున కేమికలదు....అబ్బా !....తలంతయు పాడయి పోతుంది యింటివద్దనుంటె.

కా:—ఎందుచేత ?

కృ:—అది ఒకపేగోల ! ఇక్కడకు వెళ్ళవద్దనిన్నీ ఈ....గోపాల రావు స్నేహము మానుమనిన్నీ.

గో:—నీయానందముకు నీవిచ్చట స్వేచ్ఛగా విహరించుచుండగా, మధ్య నామీద కోపమెందులకు ?

కా:-కృష్ణునికి నాకును సంపర్కము కలిగించితివని కాబోలు.

గో:-బాగున్నది. నేనేమైన బలవంతము చేసితినా ? మీరిరువురు నేక మైనప్పుడు నేను చేసేదేమున్నది ?

కృ:-(విసుగుతో) అబ్బా ! పోనీలెండి దానితో నేమి ? చూడులతా ! చాలాచీకాకు నున్నది. కాస్త బ్రాంది యిచ్చి, కొంతసేపు నృత్య ప్రదర్శనము గావించుదూ ?

( బ్రాంది పోయును, నృత్యము చేస్తు కాంచనలత )

( అనుబంధము నె. 14 )

(ఇరువురు సంతసమున తప్పట్లు కొట్టుదురు-బ్రాందిపోయుచుండును)

కృ:-పోయుము ఇంకను పోయుము........హాఁ ఎంతరుచికరముగా నున్నది; ఇది శ్రీ శ్రీ శ్రీ కాంచనలతా కరగ్రహణముచేతనే యింత రుచివంతమయినది.

కా:-(నవ్వుచు) ఆంధ్రపత్రికలలో "త్రాగుడు మానవలసిన"దని యును, మానని యెడల "శిక్షింతు"రనియు నిన్న చదివితిరికదూ ! మీరు మానరేమి ?

గో:-[తాగుటచే] మానివేయుటయా ? బుద్ధిలేని మొద్దులెవరో దీనిని నిషేధించిన మనము మానవలయునా ? దీనిసంగతి వారికేమి తెలియును ?

కృ:-[నిషావలన] అవును చక్కగా బోధించితివి ? వాళ్ళెవరో నిజంగా మతిలేక పోవుటచేతనే అట్లు వ్రాసినారు....[తాగుచు] వాళ్ళుగాని యిక్కడకు వచ్చినారూ....అంతే దీనిమహాత్మ్యము తెలియజేసి తోసిరా జననా ?

కా:-దీనియందంత మాహాత్మ్య మేమున్నది ?

కృ:-ఓసి పిచ్చిదానా ? నీకింకను తెలియదా ! అయితే విను.

సీ॥ కమనీయమైనట్టి కాంతాధరముకంటె
వాసి గాంచినది యీ బ్రాందిరసము,
బ్రహ్మ పట్టపురాణివలె పల్కు లాడింప
వన్నె కెక్కినది యీ బ్రాందిరసము;
మదియందు గల్గెడు సొదల నన్నిటి ద్రొక్కి
వైచి మోదము నిచ్చు బ్రాందిరసము ;
పరిమళంబు నెల్ల బరిభవింపుచు మేల్
పరిమళంబుల నీను బ్రాందిరసము ;
గీ॥ ఇట్టి బ్రాందిరసము వీడి యెట్టు లొక్క
కాలమును వెళ్ళబుచ్చుట ? కాంచనలత !
దీని మాహాత్మ్య మెఱుగక దీని వీడు
డనుచు దెలుపుట మతిలేనితనము గాదె ?

గో:-అవును నీవు మఱియు జక్కగ బోధించితివి. ఏదీలతా! పోయుము

కాం::[పోయుచు] పోయుదునుగాని, ధనము పోయునదెప్పుడు ?

గో:-ధనము ? ధనముకేమిలోపము ? కృష్ణారావు అడుగో !

కృ:-మొన్న నిచ్చిన 500 లును అయిపోయినవా ?

గో:-ఆహా ! పాతబాకీ లన్నియు నిచ్చితిగదా। అందువలననే మరల యీ క్రొత్తసరకు దిగినది।

కృ:-మఱచితిని. ఏదీ పోయిము. [త్రాగి] ధనము తెచ్చెదనుండు. [పోబోవును]

కా: [వారించుచు] ఆగండి తేవచ్చును. లలిత యిచ్చునా మఱి ?

కృ:-ఎందుల కీయదు ? అటువంటి భయములేదు. కాకిచేత కబురు పంపిన నీయగలదు.

కా:-అట్లయిన మీరెందు కికి ? ఎవరినైన పంపుదము.

గో:-పంపిన దిరస్కరించునని భయమేమో ?

కృ:-ఏమంటివి ? తిరస్కరించుననియా ! అట్లెన్నటికిని జరుగదు. ఏమందువా ?

గీ॥ తూర్పునందున బొడము నాతుహినకరుడు
పశ్చిమంబున జన్మించి వరలుచున్న
నాదు వచనంబు దప్ప దానాతిమిన్న
సత్య మిదినమ్ము వీడు నీసందియమ్ము॥

కా:-అట్లయిన యుత్తరము వ్రాసి యివ్వండి. ఏరినైన పంపుదము.

కృ:-అవును చక్కనిసలహా [ఉత్తరము వ్రాసియిచ్చును]

కా:-[గోపాలరావును సంజ్ఞచేయుచు] ఎవరినో పంపుట యెందులకు? నీవు పోగూడదా ?

గో:-ఆలాగే [కృష్ణుడుత్తరమిచ్చును. గోపాలరావు పోవును. పద్మయు రామారావు తోటలోనికి బోవుదురు.] తోటలో

పద్మ:—ఈముండ గోపాలరావు నిప్పుడే అక్కడకు బంపుచున్నది. ఈకారణము పురస్కరించుకొని, ఏమియును జేయదుగదా !

రా:-అదియే ఆలోచించుచుంటిని ఎందుకైన మంచిది, ఇరువురు పోలీసులను తీసుకొని పోయి అక్కడ సమయానుకూలముగ వర్తించెదను.

పద్మ:—అట్లే త్వరగా పొమ్ము.

రా:—ఇంకొకటి ! వాడు మరల యిక్కడకువచ్చి ఏమిచేయునో చూచుచుండుము. కృష్ణునిగూడ జాగ్రత్త. (పోవును) తెర

# స్వర్గభూమి

## షష్ఠమాంకము—ప్రథమ రంగము

[ప్రదేశము:-గోపాలరావుమందిరము.-ప్రవేశము: గోపాలరావు]

గో:—మంచిసమయము దొరికినది, ఈసందర్భమున నామెవస్తువుల న్నియు దొంగిలించెదగాక ! అడ్డువచ్చిన ఒకే దెబ్బతో ఫైనల్. ఇది కృష్ణుని మీదికే త్రోసెదను. వస్తువుల కాశపడి చంపినా డనుకొందురు........ అదిగాదు కృష్ణునిగూడ లేకుండ జేసెదను. అటొకదెబ్బ ! ఇటొకదెబ్బ ? ఫైనల్ ! ఎక్కడివారక్కడే గప్ చిప్ ! దానితో నాదారిద్ర్యము తీరిపోవును. ఇక నింతకంటె తరుణము మఱి దొరుకదు.

చ॥ తరుణము నేటికిఁ దొరకె; ద్రవ్యము చేతికి చిక్కసుండె ; ని
ద్ధరణిని హాయిగగ్గె; ఋణదాతలరాపిడి తగ్గు నింక, నీ
యిరువుర నింక స్వర్గపురి కేగగ నిచ్చుట నిల్చియుండె : దు
ర్భరమగు కృత్యమైన సలుపంగగ దప్పదు ద్రవ్య లేమిచేఁ॥

(డ్రాయరులో నున్న రివాల్వరు తీయును రహస్యముగా భార్య శాంత చూచుచుండును. లలితగది కేగ బయలుదేరగా శాంత వచ్చును. రివాల్వరు భార్యకు కనబడకుండ దాచును.)

శాం:—(చిరునవ్వున) ఓహో! నేడుచాలా నుత్సాహముగా నున్నారే? ఎంతవరకీ ప్రయాణము ?

గో:-ఎక్కడకును లేదు ఇక్కడకే: కాని లలిత యెక్కడ ?

శాం:—(ఆత్రముతో) ఏమి ? ఆమెవలన పనియేమి వచ్చినది ?

గో:—కృష్ణారావు వొకయుత్తరము వ్రాసి, నాచేతికిచ్చినాడు లలిత కీయమని.

శాం:—ఉహుఁ....కాని, నాదొక మనవి.

గో:—ఏమిటది ?

శాం:—మీ యీపోకడ నాకు చాలభయము గల్గించుచున్నది. ఆ యుత్తరము నా కిండు. నే నిచ్చి వచ్చెదను.

గో:—నీవీయవలసినది గాదు. నేనిచ్చితీరవలయును.

శా:—ఏమయినను మీరటు పోవుట మంచిపని కాదు.

గో:—ఏమి నేనుపోగూడదా ? ఎన్నిసార్లు నే నామెకడకు బోలేదు? ఎన్నిసార్లు మాటాడలేదు ?

శా:—ఆపోకకును ఈపోకకును జాల వ్యత్యాసమున్నది. కావుననే వలదంటిని.

గో:—అనగా ? నాకేమియు నర్థముగాలేదు నీమాటలు.

శా:—అర్థము గాలేదా ? ఆకోటుజేబులో గలదానికి అర్థమగునా ?

గో:—(వెలవెలబోయి, ధైర్యము దెచ్చుకొని, బుజ్జగీకుకొనుచు) చూడు శాంతా ! అల్లరి చేయకుము. ఈ ఋణదాతల రాపిడికి భరింపలేకున్నాను. అందు కీసాధన మొకటియే కన్పించుచున్నది. ఎట్లయినను లలిత యాభరణముల నన్నియు సంగ్రహించెదను. వీలు కానిచో (రివాల్వరుదీసి) దీనివలన సాధించితీరుదును. యింతకంటె గత్యంతరము లేదు. (పోబోవును.)

శాం:—(పాదములపైబడి) ఆగుడు. తుదకిట్లు ప్రాణాలు తీయుటకు గూడ సాహసించితిరా ? రేపీవేళకు హత్యయే చేసిన నేమగునో యోచించితిరా ?

గో:—[కోపముతో త్రోసి] ఆ ! యోచించితిని కాని దారినుండిలే ? లేదేని ముందు నీవే పోగలవు !

శాం:—నాకంత యదృష్టమా ! భర్తచేతిచావు నాకు గల్గునా ? నాధా నామాట వినుడు. నాకోర్కె చెల్లింపుడు.

చ॥ ధనమున కాశజెంది, యొకతత్తరబోడిని నిట్లు సంహరిం
చిన గడుమోసమౌను;యిది చిత్తమునం దలపోయుమయ్య నా

మనవి వినంగదయ్యా! అనుమానముచెందక మానుమయ్యా! న
మ్మిన వనితానుజింజెనక మేలౌకా! వీడుము యిట్టికృత్యముల్

గో:—చాలుచాలు నిక నీ యుపన్యాసము. అటుసూర్యు డిటు పొడ మినను నాచేయుకృత్యము విరమింపను. (త్రోచివైచి లలిత గది వైపు పోవును)

కాం:—[లేచి] ఆహా! పరమేశ్వరా! ఏమి నీమాయనాటకము? నేటితో లలిత యంతరింప వలసినదేనా?........అంతవరకు రానీ యను నాబొందిలో ప్రాణ మున్నంతవరకును. నేనే బలి అయ్యే దను. దాననైనను నా భర్తయాత్మ సంతసించు నేమో! నాకు ముక్తిగూడ లభించును. [పోవును]

... తెర ...

( ప్రదేశము-కాంచనలత మందిరము-ప్రవేశము- కాంచనలతాకృష్ణులు )

కృ:—లతా! గోపాలరా వింకను రాలే దేమి?

కాం:—యింత యాతృత యెందులకు? వచ్చును లెండు!

కృ:—అదికాదు. లలితకు నాపైగలప్రేమ నీకు చూపింపవలయునని నా కోరిక.

కాం:—లలితయనిన జ్ఞాపకము వచ్చినది. అసలు ఆమెకు వివాహమే కాలేదు కాబోలునే?

కృ:-అవును. జరుగు ననగా నాతో లేచివచ్చినది.

కా:-మీకొరకు లలిత తలిదండ్రు లేమియు జేయలేదా!

కృ:-లేదు........కాని, యీ గోపాలరా వింకను రాలేదు. కారణమే మయి యుండునో!

కా:-కారణమున కేమి యుండును? ఇల్లుగదా! భార్యతో కులుకు చుండునేమో!

కృ:-ఏమో! కులుకుచుండునో! దబ్బుగాని యివ్వనన్నదో:-చూచి వచ్చెద నుండుము: [అని అగు మనచున్నాను బయలుదేరును.]

తెర

# స్వర్గ భూమి

## షష్ఠమాంకము - ద్వితీయరంగము.

— ౹ ప్రవేశం-లలిత విచారముతో ౹ —

ల:-ఆహా ! కాలప్రభావము ! కాదుకాదు: ఇదియంతయు నాపశ్చాభావమే. పరమేశ్వరా ! నాగర్వ మన్నివిధముల నొంచితివి. ఇకనైనను నన్ను నీలో జేర్చుకొమ్ము.

....[ అనుబంధము నెం. 15 ]....

—(ప్రవేశం-గోపాలరావు)—

గో:-లలితా ! ఏమియో నాలోచించుచున్నావే ?

ల:-ఏమియైన నేమి ? ఏపనిమీద వచ్చితివి ?

గో:-ధనము నిమిత్తము కృష్ణారావు పంపెను.

లలి:-ఆఁ.... మొన్న 500 లు అయిపోయినవా?....సరియే. నీకీయను అతనినే రమ్మను మను.

గో:-వచ్చుటకు వీలులేక నన్ను పంపించినాడు.

ల:-ఏమి వచ్చుటకు వీలే దొరకలేదా ? సరియే యేమైన నేమి నిన్ను నమ్మి యీయజాలను.

....[శాంతప్రవేశించి:-రహస్యముగాదాగి చూచుచుండును]....

గో:-నన్ను నమ్మజాలవా ? ఏమి చేసితిని ?

ల:-ఇంకేమి చేయవలయును ?

గీ॥ నిన్ను మదిని నమ్మి నీయింట నివసింప
కృష్ణు నొక్కవేశ్య కిచ్చి, నాకు
నలవి గానియట్టి యాపద సేకూర్చి
నావు యిట్టి నిన్ను నమ్మగలనె ?

గో:-పోనిమ్ము. నన్ను నమ్మకపోయిన. కాని నీకృష్ణారావు యుత్తర మైనను నమ్మెదవా ? ఇదిగో ఆ యుత్తరము.

[ఉత్తరము పైకితీయబోవును.]

లలి:-తీయనక్కరలేదు. అది నేను చూడనక్కరలేదు.

గో:-ఏమి ! ఇదియును నమ్మజాలవా ?

లలి:-నమ్మకగాదు ; నీచేత నుండుటచే సత్యమైనను నమ్మను.

గో:-ఏమి ! ఎందుకు విశ్వసింపలేవు ?

ల:-ఎందుకా ?........

మ॥ ఏన్నోరీతుల బెక్కుకీడు లొదవన్ సృష్టించుచుండంగగా
నిన్నా? నమ్ముట చాలు! చాలు! చనుమా నీమాయ సర్వంబు నా
కన్నారంగను గాంచియుంటి ; నిక నీకై లాటముల్ మాని, ఏ
బన్నమ్ముల్ పడనీక మమ్ము దయతో వర్ధిల్లగా జేయవే ?

గో:-అట్లయినచో ధనము నొసంగవన్నమాట?

ల:-అవును. ఒకపైసయైనను నీయను. [శాంత ఆత్రముతో చూచు చుండును.]

గో:-[రాని నవ్వుతో] చూడు లలితా ! మర్యాదగా జెప్పుచుంటిని, వింటివా ? సుఖపడియెదవు. లేకున్న నాభరణములకుగూడ నాశ వదలికొన వలసినదే? అడ్డిన నపాయముకూడ కలుగును సుమా!

లలి:-ఏమీ బెదిరించుచుంటివా ? నీకు ఆభరణములు కాదుగదా ! ఒక్కపైసయును లంభింపజాలదు.

గో:-[కోపముతో రివాల్వరుపైకి దీసి] ధనమునిచ్చెదవా? లేక చచ్చె దవా ?

ల:-[భయపడియు, ధైర్యము తెచ్చుకొని] ప్రాణమునైన నిచ్చెద గాని ఒకరాగిపైసయైన నివ్వజాలను.

గో:-దుర్మార్గురాలా ! యింక సహింపజాలను. చావుము. [రివాల్వరు

[ప్రేల్చును. తటాలున శాంత అడ్డువచ్చును. "హా" యని పడిపో వును.]

(బయట సాధువురూపమున నున్న రామారావు తుళికిపడును)

రా:-ఆహా ! త నను కొన్న దంతయు నేరవేర్చుకొనినాడు. వచ్చెద మనిన యీపోలీసువా రింకను రాలేదు. ఈ హంతకు డెచ్చటికిని బారిపోకుండనైన చూచెదను. [లోపలకు వచ్చుచుండును.]

ల:-[శాంత పడిపోవుటచూచి] అయ్యో ! హత్య హత్య రండు రక్షిం పుడు. రక్షింపుడు.

గో:-[భయాశ్చర్యములతో] హా ! ఏమిది ? ఎవరిని జంపితిని శాం తనే ?——....[కోపముతో] దుర్మార్గురాలా! నీకొఱకై నాభార్యను చేతులార జంపుకొంటిని. ఇంక నీవుమాత్రము ఎందులకు ? పొమ్ము. [రివాల్వరు ప్రేల్చును.]

ల:-హా !....కృష్ణా ! [అని దెబ్బతిని పడిపోవును. గోపాలరావు అక్కడగలపెట్టెలో నగలును, ధనమును తీసికొని బయలు దేరును.]

రా:(-లోపలకు వచ్చుచు రెండవ రివాల్వరు చప్పుడును విని) ఏమిది? రెండు హత్యలా ? రెండవవారెవరు? ఎంత భయంకరసంఘటన! ఆహా ! [లోపలకు వచ్చుచుండును. గోపాలరావు ప్రళయకాల రుద్రునివలె వచ్చుచుండును.]

రా:-[వచ్చు గోపాలరావును గాంచి] అదిగో! భయంకర రూపముతో వచ్చుచున్నాడు. నేనీ సమయమున కంట బడిన చావే ప్రాప్తిం చును. [ఒక స్థంభము మాటున డాగును. గోపాలరావు బయటకు పోవును.]

రా:-ఇప్పుడు నే నేమిచేయను?........సరియే. పోలీసువారు వచ్చిన నిక్కడ చూచుకొందురు. నేను వీనినే వెంబడించి, వీడెక్కడకు బోవునో చూచెదను. [పోవు గోపాలరావును వెంబడించును, రెండవదారినుండి కృష్ణారావు ప్రవేశించును.]

కృ:-[లోపలకు వచ్చి] లలితా....లలితా !....ఏమిది ? కనబడదు.... హా ! ఆ(....ఇదియేమి....ఎవరు ఇట్లు చంపెరి. ఇదుగో కాంతా దేవిని కూడానా ?........ఎవరు చంపిరో గదా !....ఏడీ నేను పంపిన గోపాలరావు ?........పోలీసులకు తెలియజేయ, వెళ్లియుండెనా ?....లేక....ధనమునకు ఆశపడి ఇట్లు కాల్చియుండెనా ? [పెట్టెచూచి] వస్తువులు ధనముకూడ మాయిమయినవె?........ గోపాలరావే అయిన భార్యను చంపుకొనునా ?........[బయట మోటారు చప్పుడు. కృష్ణుడు పైనుండి చూడగా పోలీసులు వచ్చుచుందురు.] ఏమిది ! ఇట్లయినది. నామీద నే నేరము రాదుగదా ! నేనిప్పుడేమియు తెలియనట్టుగానే యుండుట మంచిది. నేనుపోయి ఆ కాంచనలత మందిరములోనే ఉండెదను. (దొడ్డిగుమ్మము వైపుగల చీడీలనుండి పారిపోవు చుండును. అటువైపును పోలీసువారు వత్తురు. కృష్ణుడు భయముతో అలాగే నిలబడిపోవును.)

(పోలీసు లతనిని బంధించి, పోలీసాధికారి కడకు దీసుకొని వత్తురు.)

పో:అ:-(చిరునగవున కృష్ణారావుతో) ఏమండీ ఏమిటీ సంగతి? వీరిని ఎవరు చంపిరి ? వీరిని నీవేమయినా నెఱుగుదువా ?

కృ:-ఎవరు చంపిరో తెలియదు. ఈమె నాభార్య. ఈమె ఈయింటి స్వామిభార్య.

—[ • చాలామంది ప్రజలు గుంపులు గుంపులుగా వత్తురు. • ]—

పో:అ:-నీపేరు ?

కృ:-కృష్ణారావు.

పో:అ:-నీవు వీరిని చంపకపోయిన, నీకు భయమెందులకు ? దొడ్డి గుమ్మమువైపు పారిపోవుట యెందులకు ?

(ప్రజలు పరిపరి విధాల పల్కుదురు. పోలీసులు వారింతురు)

కృ:- నన్ను నేరస్తునిగా దలంతురని. పారిపోవనెంచితిని.

పో:అ:-హుం—నీకెవరిమీదనైన ననుమానమున్నదా ?

కృ:-ఉన్నది: ఈ యింటిస్వామి గోపాలరావు మీదనే.

పో:అ:-కారణము ?

కృ:-నేను, ధనము నీయవలసినదిగా నాభార్యకు ఉత్తరము వ్రాసి, గోపాలరావు నిటకు బంపితిని. అందుచేత....ధనము చేజిక్కించుకొని, పారిపోయెనేమో !

పో:అ:-(ఆలోచించుచు) హుఁ— ఆ సాధువునుగూడ గోపాలరావే చౌర్యముగాని, హత్యగాని, సలుపునని చెప్పినాడు. అట్లే అయినది........కాని, ఏడీ ఇక్కడ నుందు ననినాడు కనబడడు ?....

కృ:-(ఆతృతతో) సాధువా? ఎవరు? అట్లయిన అతనికి సర్వము తెలిసియేయుండును. అతనిని వెదికింపుడు.

పో:అ:- [సాధువును వెదుకుట కిరువురను బంపి, శవములను పరీక్షించుచుండును.]

— తెర —



# స్వర్గ భూమి

## సప్తమాంకము — ప్రథమ రంగము

(ప్రదేశము-కాంచనలతా మందిరము-ప్రవేశము-కాంచనలత : పద్మ.)

కా:-(పద్మచే జడవేయించుకొనుచు) పుష్పం! ఇంకా, కృష్ణారావుగారు రాలేదు ; గోపాలరావుగారు రాలేదేలనో ?

ప:-ఆఁ వస్తుంటారమ్మ. వెళ్లింది ఇంటికిగదా ?....భార్యా....పిల్లలా ఆయనకేమయిన ?

కాం:-ఉన్నట్లు లేదు. సరి దానికేం ?........(ఊయలమీద కూర్చుండి యూగుచు) నీకేమయినా పిల్లలు కలిగేక వదిలిపెట్టేడా నీభర్త ?

పద్మ:-లేదమ్మా !........అంతటి అదృష్టమా ?........

కా:-పాపము ! విచారింపకుము....కష్టపడినవారికి సుఖము తప్పదులే.

పద్మ:-నామీద నీకెంతదయమ్మా! (కళ్ళుతుడుచుకొని) పువ్వులుపెట్టుకో అమ్మా ! గ్రుచ్చియుంచాను. (తెచ్చిపెట్టును.)

కా:-పుష్పం:-ఏమీ తోచుటలేదు. ఏదైనపాట పాడుదూ ?

ప:-ఎలా తోస్తుంది....వారు లేదుగదా !

కా:-నీకు పరిహాసమే!....పాడవూ.

ప:-అలాగే నమ్మా........

పద్మ—పాట:

లోకము విచిత్రమయమూ - ఈ
లోకము విచిత్రమయమూ ॥లోక॥1

మోద మొకరికీ - ఖేదమొకరికీ
ఖేదము లిట్లే - వృద్ధి వహించెను ॥లో॥2

గడన మొకరిదీ - ఖర్చింకొకరిది
అడిగెడివారా ? - ఆర్చెడివారా ? ॥లో॥3
కనకము, శునకము - శునకము కనకము
గా మారెను యీ - కలికాలంబున ॥లో॥4

సలిపెడి పనులు - తలచిన భయము
పలికెడి పల్కులో - కలుగు వినయము ॥లో॥5
ధర్మాధర్మ విచక్షణ తొలగెనే
మర్మము ప్రతిమాటలొ కలిగెను ఈ ॥లో॥6

(బయట తలుపుచప్పుడు: పద్మ ముసుగు సవరించుకొని లోపలకు పోవును. కాంచనలత ఖెళ్ళి తలుపుతీయును గోపాలరావు రక్తసిక్తపు వస్త్రములతో, భయంకర రూపముతో ఆతృముగా లోన ప్రవేశించును. రామారావు (సాధువు) దొడ్డిగుమ్మమూ నుండి ప్రవేశించును)

రా:—(పద్మను కలిసికొని) పద్మా ! కొంపమునిగినది. దుష్టుడగు నీ గోపాలరావు లలితను తనభార్యను గూడ చంపినట్లున్నది. పోలీసువారింకను రాలేదు. వీడు పారిపోకుండ నెట్లయిన కనిపెట్టవలయును.

ప:—రెండుహత్యలే. అబ్బా:

రా:—పద్మా! వీడు కృష్ణారావును ఈతిమ్మిరిలో నేమైన చేయునేమో!

ప:—వారు ఇక్కడ లేరే ! గోపాలరావు ఎంతకురాలేదని ఇంతకు ముందే బయిటికే వచ్చేశారు.

రా:—అమ్మయ్య ! పోనీలే. ఇదికూడ కొంతనయము. సరే నేనిప్పుడు ఆ హత్య మందిరమునకే పోవుదును. ఇక్కడ గోపాలరావును చాల జాగ్రత్తగా కనిపెట్టి చూచుచుండుము. ఆ !

ప:—అలాగే లోపలనున్న, వాడు ఎక్కడ దాగుకొన్నదియు కనిపెట్టుదును. కాని బయటికి పోయిన ?....

రా:—అది నేను చూచుకొనెదనులే బయట నెవరినైన కాపు పెట్టెదనులే. మరి నేను వెళ్లివచ్చెదను జాగ్రత్త.

(బయటకు వచ్చి హత్యామందిరము వైపు వచ్చుచుండును. పోలీసులు కనబడి పోలీసాధికారి యుత్తరవు చెప్పును. రామారావు ఆ కాంచనలతా మందిరమువద్ద వానిని కాపుబెట్టి తాను హత్యా మందిరమునకు వెళ్ళును.)

## కాంచనలత మందిరము

(గదిలో తలుపువైచుకొని కాంచనలతా-గోపాలరావులు-బయటద్వారముకడపద్మ:)

కా:—అయిన నన్నిప్పుడేమి చేయమంటావు ?

గో:—నన్ను రక్షింపవలెను. కృష్ణుడు రాగానే సంజ్ఞచేసితివా ఇదిగో ఈ రివాల్వరు దెబ్బతో వానిజీవితముకూడ స్వస్తి....ఆవస్తువులు ఇవిగో.... ఈరివాల్వరు........పరుపుక్రిందనే పెట్టితిని.

కా:—అబ్బా ! నాకేమో భయమగుచున్నది.

గో:—భయమేమిటి ? ఇంకెవరికీ తెలియదు గదా ?.... అన్నట్టు పుష్పం ఏదీ ?........

కా:—అది ఉద్యానవనములో ఏదో పని చేసుకొంటున్నది కొబోలు? సరే....దానికేం....రా....ఆ రహస్యమందిరములో దాగుందువుగాని........

(వారు వచ్చుధ్వని గాంచి పద్మచాటున డాగి వారిచేష్టలు కనిపెట్టుచుండును. కాంచనలత వానిని రహస్యమందిరమున దాచును.

— తెర —

# హత్యామందిరము.

## [గోపాలరావు గృహము]

(ప్రవేశము-పోలీసాధికారి వగైరాలు కృష్ణారావుతో సహా.)

పో; అ:—(ప్రచారు చేయుచు) ఆ సాధువు యింకను గనబడలేదు కాబోలు. గోపాలరావువలననే దోషమా ? లేక ....కానిండు దీని అంతము తేలువరకును మీరు బంధితులు కావలసియున్నది. పదండి ఠాణాకు.

[ సాధువు-రామారావు-ప్రవేశము ]

రా:—(ఆత్రతతో) రండి ; రండి త్వరగా రాకున్న హంతకుడు పారి పోవును........ఇదియేమి ఇతనిని అరెష్టుచేసినారు ?........వదలి పెట్టండి.

పో; అ:—సరిగా మేము వచ్చునప్పటి కీతడు పెరటి గుమ్మమునుండి పారిపోవ జూచినాడు. అందువలన నితవి ననుమానముపై బంధించితిమి.

రా:—సరియే....ఏదియో పొరపాటున జరిగినది హంతకుడు దొరకినాడుగదా ! రండి ; రండి.

(అందరు కాంచనలత మందిరమువైపు వెడలుదురు.)

## కాంచనలత మందిరము

( ప్రవేశము-కాంచనలత : పద్మ రహస్యముగా )

కా:—ఏమిది ఇంకను కృష్ణారావు రాలేదు. అతడేమయిన పోలీసువారితో నాలోచించుచున్నాడా ! ఒక్కడును వచ్చిన బాగుండును. పేచీలేకుండా చేయించెదను....హుం....ఎందుకైనా మంచిది, ఈ

వస్తువులు రివాల్వరు రహస్యస్థలమున నుంచుట మంచిది....(వస్తువులనన్నిటిని రహస్యమైనచోట దాచును; పద్మయిది కనిపెట్టును.)

కా:—(ఏదియో చదువుచున్నట్లు నటియించుచు) పుష్పం ! లోపల నేమిచేయుచున్నావు. ఇలారా:

పద్మ:—[వచ్చుచు] వస్తున్నానుఅమ్మా!........ఏమమ్మా ! అతిదీనముగా, అదోవిధంగా కనబడుచున్నది మొగము.

కా:—ఏమీలేదు. మనసులో నేమోగాని శరీరము చాల బడలికగా నున్నది.

ప:—అయితే తొందరగా భోజనముచేసి పడుకోవమ్మా ! వారు.... వచ్చి....ఆనందము కలుగజేస్తారులే.

(బయట తలుపుచప్పుడు కాంచనలత తలుపుతీయును.)

( కృష్ణారావు, పోలీసులు మొదలగువా రందరు లోపలకు వత్తురు.)

కా:—[పోలీసులు వగైరాలు అందరును జూచి భయపడి, మరల ధైర్యము దెచ్చుకొని] ఏమిటిది ? వీరందరు నెందుల కిక్కడకు ఏమిటీ సంగతి ? .

కృ:—సంగతియా ?....ఏమిలేదు. కాని, గోపాలరావు వచ్చినాడట ఏడీ ? ధనము తెచ్చినాడా?

కా:-ఎవరన్నారు ? వచ్చినాడని ? మీరుపంపిన తర్వాత యింకను రాలేదే ? ధనము పట్టుకొని పారిపోయెననియూ యీపోలీసువారిని కూడ........

పో:అ:- ఉష్....అందుకొరకుగాదు. అతనితో పనియున్నది. అతనికి వారంటున్నది. అతనిని దాచిన నీపనికూడ కాగలదు. లే త్వరగా

కా:-అతనికి వారంటా ? ఏమి ! ఏమి చేసినాడు.

రా:-ఏమి చేయవలయునింక ? ఇదిగో కృష్ణారావు భార్యను, పాపము తనభార్య శాంతను హత్యజేసి పారిపోయినాడు. ఇటు వచ్చినాడట కాదా ? చూపించి నీవు తప్పుకో.

కా:-అమ్మయ్యో ! హత్యలే ! రెండే ! బాబో రెండే.

పో:-ఆఁ రెండేకాని, అతని వృత్తాంతమేమిటి ?

కాం:-బాబూ ! నాకేమీ తెలియదు. ఇక్కడకు రాలేందే ? వీరిమీద ఒట్టు ; రాలేదు కావలసినచో నిల్లంతయు చూచుకోండి.

పో:-సరియే. (భటులను వెదుకుమని అజ్ఞయిచ్చును)

రా:-[తానుబయట కాపుపెట్టిన భటుని గోపాలరావు పారిపోలేదుగదా! యని ప్రశ్నించెను. వాడు దేవనును—పోలీసులు ఎక్కడా లేదనియు, ఈ దాసితప్ప ఎవరును గనబడలేదనియు జెప్పుదురు.]

కృ:[అత్రిముతో నామె తనభార్యయేమోయని తలంచుచు చూచుచుండును.]

పో;అ:-ఏమమ్మా ! ఇక్కడకు గోపాలరావుగాని వచ్చెనా ? ఇప్పుడు గాని, [కాంచనలత జెప్పవలదని సంజ్ఞచేయును]

ప:-ఆఁ వచ్చేరు. వస్తువులమూట, రివాల్వరు కూడ ఇచ్చారు. వీరు రాగానే కబురు చేయుమనిగూడ చెప్పాడు.

రా:-కబురా ! కబురులెందులకు....?....

పద్మ:—చ....ం....పు....ట....కు........

కృ:—అబ్బా ! యెంతటి మాయావులు....

పో;అ:—హుం తరువాత ?

కాం:-ఈమె చెప్పేవన్ని అబద్ధాలండి. కావలసిన వస్తువులు కూడ చూచుకోండి.

పోలీసా:-ఊరుకో—తరువాత ఎలాగు వెదుకుతారు.

పద్మ:-తరువాత అతనిని........అగదిలో ఒకమూల మాయగది ఉన్నది. దానిలో దాచినది........ఇదిగో ఈ మాయపెట్టెలో వస్తువుదాచినది. [వస్తువులు బయటకి తీసి చూపించును.]

కృ:-ఈ వస్తువులన్నియును లలితవే.

పో:అ:-దీనికేమందువు ?

కా:-[భయబడుచు] క్షమింపవలెను. ఇవి గోపాలరావు యిచ్చినవే. హత్యలుజేసి తెచ్చిన వనుకోలేదు.

రా:—అనుకోలేదా ? అట్లయిన నతని దాచుట యెందులకు.

పో:—సరి, దానికేమిలే-పద-పద-ఆ తలుపులు తీయుము.

కాం:—నా తప్పు క్షమింపుడు-నన్ను మాత్రము రక్షింపుడు.

పో:—సరియే-మా శక్తి కొలది ప్రయత్నింతుము....పద....

(కాంచనలత యా మందిరము తలుపులు తీయును-గోపాలరావు బయటకువచ్చి-అందరనుచూచి భయపడును.)

కృ:—ఓరీ ! మిత్రద్రోహీ ! ఎంత పని సల్పితివిరా ! తగిన ఫలమను భవింతువు లెమ్ము.

గో:—( వినిపించు కొనకయే - కాంచనలతతో ) దుర్మార్గురాలా ! నిన్ను నమ్మినందులకు పట్టి ఒప్పగించితివా !

రా:—నిన్ను నమ్మిన వారిని హత్యయే జేసితివి గదా ! అప్పుడీ జ్ఞాన మెచ్చటికి బోయినది ?

గో:—(వినిపించుకొనక క్రోధముతో ప్రక్కనున్న కుర్చీ పైకెత్తి) మోసము చేసినందులకు ప్రతిఫల మనుభవింపుము దుర్మార్గురాలా ! ( అని బలముకొలది విసరి మొగముపై కొట్టును )

( తలపై తగులుటచే కాంచనలత హాహాకారములు సల్పుచు పడిపోవును-గోపాలుని బంధింతురు. )

రా:—అబ్బా! ఎంత సాహసము! దీనితో మూడు హత్యలు ఒకే రోజున! అబ్బా!

కృ:-ఇంక వీనిని పోలీసువారు బట్టిరిగదా! వారే వీనిని శిక్షింపగలరు.

గో:—హుం-నీ శిక్షమాత్రము తప్పిపోయినది.

పో:—అవును. ఈ సాధువు లేకపోయిన నంతియే జరిగియుండును.

కృ:—అవును—స్వామీ! మీయనుగ్రహమున నాకీ ముప్పు గడిచినది. మీమేలు మరువ జాలను. తామీ విధముగా మాకై మేలుచేయుటయు, ఇది ఈవిధముగా జరుగనున్న సంగతి మీకు తెలిసియుండుటయు చూడ, మీరెవరాని? యని........

పో:—అవును. నాకు నదియే యనుమానము.

రా:—నాసంగతి కేమి లెండు. సర్వము కాంచి, మనకీవిధముగా తోడ్పడిన యీ ప....పుష్పగంధికే మనమందరమును ఋణపడియున్నాము.

కృ:—అవును. కాని, ఈమె నెప్పుడో చూచినట్లును, మఱియు నీమెయందు నాభార్య పద్మ ముఖ లక్షణములును గనపట్టుచున్నవి. ఆమె కాదుగదా:

రా:—బాగు బాగు ఈమె నీభార్యయా? ఇంతవరకును లేనియనుమానము నేడేల పుట్టినది?

కృ:—ఇంతవరకు నీమెను నేను సరిగా జూడలేదు.

రా:—నీకా యనుమాన మెందులకు? ఆముసుగు దీయించి ఎదుట నిలువ బడి సావకాశముగా చూచి ప్రశ్నింపుము.

కృ:—పుష్పం! ఏదీ ఇటు తిరుగుము........

రా:—సిగ్గుపడకుము నీవెవరవు?....చెప్పుము.

ప:—ముందు నీ రూపమును మార్చిన పిదపగదా! నా రూపమును గుఱించి చూచుట?

కృ:—ఏమిది? ఆశ్చర్యము! ఈ సాధువురూపముగూడ మాఱువేషమేనా? ఎంత చిత్రము!

పో-అ:—అంతియేగాదు. వీరొకరి నొకరు బాగుగా దెలిసినవారై ఏదో కార్యార్థ మిటుల మాఱురూపములను ధరించిరని వీరి మాటల వలన దెలియుచున్నది. (రామారావును గాంచుచు) ఏమండీ! అంతియేనా?

రామా:—(చిఱునగవుతో) అవును.

(కృష్ణారావు ఆశ్చర్యముగా వినుచుండును)

పో:—అట్లయిన నాలస్యమేల? మీపూర్వరూపమును ధరించుడు.

రా:—(కృష్ణారావు భుజము దట్టుచు) ఇంతసమీపమునందున్నను, నన్ను గుర్తింపజాలకుంటివా?

(అని తన కృత్రిమపుగడ్డమును తీసివేయును)

కృ:—ఆఁ....రామారావా? (కౌగలించుకొని) కండ్లకావరమువలన నిన్ను, నీ నీతులను గ్రహింపనేరని నన్ను క్షమించుము.

పో:—ఏమిది! చిత్రము! ఈయన ఎవరు?

కృ:—నా మిత్రుడు; నా సోదరుడు; నన్ను రక్షింప దలంచినట్టి మహాత్ముడు....

పో:—బాగుబాగు—అట్లయిన ఈమె....?

రామా:—అమ్మా! పద్మా! ఇంకను దాపరిక మేల? నీ ముసుగు సడల్చి, నీ నిజరూపమును కనబఱచుము.

(ఆమెయు రామారావు చెప్పినప్రకారము చేయును)

కృ:—ఆఁ.... నాభార్య పద్మయే. ఆహా! ఎంత చిత్రము! నా గురించి - నా మిత్రుడు, నాభార్య యిట్లు పెక్కుకష్టముల కోర్చి, చివఱకు నీచాతినీచమైన వేశ్యకాంతా సేవయా! (భార్యను సమీపించి) పద్మా! నన్ను క్షమించుము. నీ పతివ్రతా మహిమకు అంజలి ఘటించుచున్నాను. (అని నమస్కరింపబోవును)

ప:—(వారించుచు) ఆఁ....ఆఁ....ఇదేమి? వలదు. నాకీ పాపమును ఘటింపవలదు. ఇప్పటికైనను నన్ను ప్రేమతో స్వీకరించిన నా కదియే పదివేలు; నా కదియే స్వర్గభూమి.

కృ:—పద్మా! ఇంతవరకు నయినదానికే చాలపశ్చాత్తాపము చెందు చున్నాను. ఇంకను నిన్ను కష్టపెడుదునా ?

రా:—కృష్ణా! నీవనినట్లు యీనాటినుంచియైనా మీరిరువురూ హాయిగా నుండుటయే మాకందరకును సంతసము.

పో:—మీరొక సారి రాణాకువచ్చి, పోవలసియున్నది. తరువాత కథ మేమే చూచుకొందుము.

రా:—మంచిది, అట్లనే. అక్కడ మాపనియైన పిదపనే మాయూరు చేరుకుందుము.

పో:—మంచిది, రండి పోవుదము.

[అందరు నిష్క్రమణము.]

— తెర —



# స్వర్గభూమి

## సప్తమాంకము - ద్వితీయరంగము

(ప్రవేశము-శ్రీధరరావు మందిరము-ప్రవేశము-శ్రీధర వాసుదేవరావులు)

శ్రీధ:—దావగారూ! నేటికి నాప్రాణమునకు హాయిగల్గినది; నాపద్మ జీవితమునకు సుఖముగల్గినది.

వాసు:—అవును. ఇదంతయు పద్మావతి మహిమయు, రామారావు త్యాగమును.

శ్రీద:—అందును రామారావుయొక్క త్యాగబుద్ధికి నాకెంతోయో వింత జనించుచున్నది.

(లోననుండి వరలక్ష్మి, మీనాక్షులు ప్రవేశము)

వర:—మీరు యిక్కడనే కబుర్లు చెప్పుకొనుచూ కూర్చున్నా నెట్లు? రైలు వేళవుతుంది గాబోలు?

శ్రీధ:—డ్రైవరు కారు దీసకొనియేవెళ్లినాడు. ఈపాటికి వచ్చుచునే యుండును. (తెరలో కారుచప్పుడు)

వాసు:—అదిగో! కారువచ్చినది, వచ్చినట్లున్నారు.

(ప్రవేశము-రామారావు: పద్మా: కృష్ణారావులు)

(కృష్ణారావు, పద్మ, రామారావు వారందరకు నమస్కరించెదరు. వారు దీవించుదురు. కృష్ణుడు చిన్నబోయిన వదనమున నొకచో గూర్చుండును.)

వర:—నాయనా! జరిగినదేదో జరిగినది. విచారమికయెందుకు; సిగ్గెందుకు?

శ్రీధ:—అవును, నాయనా! లే! కులాసగా యుండుము.

మీనా:—ఇదంతయు కర్మ. లే! నాయనా! (పద్మను దగ్గరకు తీయుచు) ఈ ఆనందమున కంతయూ నాకోడలి మహాత్మ్యమే!

[కామేశ్వరి లోపలనుండి వచ్చుచు:] అత్తయ్యా ! కోడలి మహత్తు గాదండీ ! బావగారి పసదిగి పట్నం వదలి పల్లెటూరు చేరారు !

(అందరు నవ్వుదురు)

వాసు:—బావగారు ! కామేశ్వరి మహా పెంకిపిల్లండీ ! ఎలాంటి మగడు వస్తాడోగాని.

శ్రీ:—మగడా ? ఉన్నాడుగా రామారావు ?

వాసు:—అట్లనా ?

వర:—ఈసంతోషమయంలోనె ఆనంద చిహ్నముగా వీరిరువురి వివాహం చేయుట బాగుంటుందండీ !

పద్మ:—అవును, నాన్నా! తప్పక అట్లే చేయండి!

కామే:—చూడునాన్నా! (అని గారాము చేయును)

కృ :—నేనుచేసినట్లు రామారావు చేయడులే కామేశ్వరీ!

కామే:—చేస్తేనా? అక్కయ్యవలె నేనూ చెయ్యనులే ; ఆ గుమ్మం అటూ, ఈగుమ్మం ఇటూ, (అందరూ నవ్వుదురు.)

రామా:—(నవ్వుచూ) అయితే! నాకసలు వద్దు మామయ్యా!

శ్రీ:—వద్దన్నా తప్పదు - బలవంతంగానైనా చేసియే తీరుతాం.

వర:— లెవండి యీ పరిహాసముల కేమి ? భోజనాలు చేద్దురుగాని.

శ్రీ:—లేవండి. పాపం! వీరెప్పుడు తిన్నారో ఏమో!

( అందరు నిష్క్రమణము )

సర్వము సంపూర్ణము.



# అనుబంధములు.

౧

పద్మ:—కాంతుని మోసే - కలువైపోయె (నా)
స్వాంతము అతనికై - వంత వహించెగా ||౧||
మురిపెముతో నా - మోహన రూపము
కలువుదీఱగా - గాంచగ గలనోకో! ||౨||
మామక హృదయా - మార సమానా,
ఓముము నను; నీ - యువిదను గానా? ||౩||

౨

కామేశ్వరి:—ఏలనే యిటు - బేలవైపడి
చాలగ వగచుట - మేలా? తలపవు ||ఏ||

ఎప్పటికైనను - కృష్ణుడు మదిలో
తప్పడు దారిని - తప్పక కనుగొను;
అప్పుడు కన్గొన - ఒప్పుగ నిన్నిక
ఒప్పుల కుప్ప! నీ కొప్పని పని యిది ||ఏ||

౩

రామారావు:—అహ, కాలమహిమ...అహ!
అహ! కాలమహిమ ||అహ||౧||
పరభామినులతో - దిరుగుచు తమతమ
భార్యాహితులన్ - వదలెడి వారే ||౨||
తుది కేమగునో! - మదిలో దలపరు
తుంటరి బుద్ధుల - తో నుందురుగా ||౩||

౪

పెంటడు భార్య:— డైలాగు.

బియ్యపు నూకలు చేరడైన లేవు (ఇంటిలో)
పొయ్యిమీదికి కుండెటు లెక్కానురా ||౧||

వెంటయ్య:— కయ్యి కయ్యి మనుచు - నాతో కాలు దువ్వుచేగాని
వియ్యమందగా నెపుడు (నాతో)
మాటలాడితే? పిల్లా ॥౨॥

వెంటడు భార్య:—వియ్యమా! నీతో నాకు - కయ్యము లేకుంటె చాలు!
వియ్యమంది నట్లె (నీతో) దెయ్యమా! ఓ దయ్యమా (కొట్టును.)

వెంటడు:— చీపుర దెబ్బలు కొట్టకె - అబ్బ! అయ్యో...
చిక్కిపోత నంటను (బాపనోళ్లు) అబ్బ!
ఎందుకైన మంచిదే,
కొట్టకే...అబ్బ...కొట్టకే ॥౩॥

౫

మీనాక్షి:—తనయుని చేష్టలు - తలపున బడినచో
ఘనమగుదుఃఖము - కల్గుచు నుండెగా ॥౧॥
ఏయెడ నుండెనో! - ఎట్లుగ నుండెనో!!
ఏమియు తెలియదు! కేమి యొనర్తుము ॥౨॥
చదువులకయి నిను । వదలిన నిట్టుల
వృద్ధాప్యములో ! విడనాడి యుంటివె ! ॥౩॥

౬

కాంచనలత:—ఈ యౌవనము వర్ణింపగ శక్యమె!
ఆ యజునికి బ్రహ్మాదులకైనను ॥౧॥
పొరలి పొరలి - పొంగు పెరిమ
పరికింపగ యీ । ప్రాయమ్ము నే కదా ॥౨॥
పూలతోటలో - పూవుటుయ్యాలలో
చాలగ నూగేదీ । కాలమేగద! ॥౩॥

౭

లలిత:—మదిలోగల కోరికతో నిచటికి
పదిలముగానూ చేరితిమి;
వెదుకగ వశమా! మా వారలకీ
వృత్తాంతంబే తెలియదుగా ॥౧॥
వెంకటరావును - వీడితిగా ఏ
శంకయు ముందలి గల్గదుగా,
పొంకముగా నీ కృష్ణునితో నిక
బింకముగా విహరించెదగా ॥౨॥

౮

కాంచనలత:—నీ మురళీమహి - మను యిట్టిదిగా
నా మనమును యి - ట్టే మురిపించితివి ॥౧॥
నీస్వరగానా - మృత వాహినిలో
నీదుచు వచ్చితి - సాదరమునగను ॥౨॥
విడనాడి యుంటి నా - విభుని కాంచనధర!
కడుదయతో నను - గావు శ్రీకృష్ణా ॥౩॥

౯

పద్మ:— జీవా! దేవా! దేవ! మహానుభావ!
దివ్య ప్రభావా! ప్రేమకరావా ॥౧॥
నిరతము నిను నే గొలిచిన సేవా
పరికింపక నీగతి జేసితివా ॥౨॥

"పతిపదసేవా పడతికి త్రోవా"
మతి మంతులు మును బలుకగ లేదా? ॥౩॥
నాపతి నిటులా పా డొనరించినా;
నా ప్రాణములిక నేగతి నుండును? ॥౪॥

౧౦

పద్మ:—పుష్పముల ధరియించు మొక్క—
పూవు బోడుల కబ్బె, గాన
పుట్టె నవ్వని వలన సుమములు
పుడమిలోన; గాంచు డివిగో ॥పు॥

పొలతులారా! వేగరండి,
విలువ జూడ స్వల్ప మండి,
జాలమేమి సేయకండి
చక్కనైన పూలు గొండి ॥పు॥

ప్రేమతోడ స్వామిపూజ
నియమముగను జేయుటకును,
కొమ్మలారా! కోర్కెదీర
కొప్పులందు ముడుచుటకును ॥పు॥

## ౧౧

లలిత:- మోహాసంద్రమునందు - మునిగి నే నిటులైతి
ఆహా! నా బ్రతుకెంత - అవమానముల జెందె ॥౧॥
ఈ కలుషాత్ముని నమ్మి - ఎంతో ముచ్చట నొంద
నా కాపురంబున - కీకర్మ ఘటియిస్తె? ॥౨॥
నాకై తలిదండ్రులు - నయమార జూచినా
నాథుని వీడా, శ్రీ - నాథ! యిటు లొనరిస్తె ॥౩॥
నా కథా వినిన యీ । లోకము యెంతొగ
నీకాకు నొందునో? - ఛీ, ఛీ, నా బ్రతుకేల? ॥౪॥

## ౧౨

పద్మ:—తిమిరపుంజ మెల్లవీడె । దిక్కులెల్ల తెల్విగాంచె
సుమములెల్ల కనులువిచ్చె । చూడ మనము సంతసిల్లె
అహాహా... ఈ వనములోన... ॥౧॥
కమల మిత్రుని రాకజూచి । కలువలెల్ల నిదురవీడె
"కష్టసుఖములెల్ల మనకు । కాపురంబె" యని దెల్పగ
అహాహా... ఈ సృష్టిమహిమ... ॥౨॥

## ౧౩

కాంచనలత:—ఆహా! ఈసుమవన మెంతో - ఆనందమాయెగా
ఏమి యీశోభ - కనగా - ఏమి యీశోభ! ॥౧॥
ప్రేమ రాగములతో - పికశుక సంతతి
అలరుచు నుండెనుగా - ఆహా! అచ్చెరు వాయెనుగా ॥౨॥
మల్లె సంపెగలు - మందారంబులు
వికసించెను చాలా - నేడు - వేడుకబుట్టెనుగా ॥౩॥

## ౧౪

కాంచనలత:—సుందరాకార! నిను - చూచి నే వలచితి
పొందుగా నేలుకోరా - వందన మిది గైకోరా ॥౧॥
మారసమాన! నిను - మందిరమందు దలచితి
గారవమున నన్ను - గైకొని బ్రోవుము సామి ॥౨॥
ఇదిగో వచ్చెద నని । అదిగో వచ్చెదనని
వదలక బోకురసామి । వంతల ద్రోయకురా ॥౩॥

౧౫

లలిత:—ఓ పరాత్పరా! నా । పాపపుంజముల
ఓపజాల కిట్లు వేద । నా పరంపరల్
ఓర్చియుంటివా? సుంత ఓర్చిజాలవా ?

జీవమేల? నన్ । జేరదీయవా?
బ్రోవ రావ? వేగ రావ? భుజగశాయనా ॥౨॥

సర్వవిధముల । సన్యాసినైతి నే,
సర్వరక్ష! వేగ నన్ను । సమయ జేయవే॥౩॥



శ్రీ బాలాత్రిపురసుందరీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. సికింద్రాబాదు.

మావద్ద:—



చేతిపనుల విధానము

అను

## వర్తకరహస్యము

రచన:—ఆర్. బంగారయ్యగారు

సుమారు 200 విధానములు గలవు. వెల 0-12-0



వెలువడినది! త్వరపడుడు!

స్కాంధపురాణము నాధారముగా గో. బ్రహ్మశ్రీ అమ్మనబ్రోలు సుబ్బారాయ శర్మగారిచే తాత్పర్యములు వ్రాయబడిన.

## శ్రీ శివగీతలు

అను సకల వేదాంతసారమైనదియు, ముముక్షువులకు ఆనందమునిచ్చు నదియునై అలరారుచున్నది.

250 పుటలు: చక్కని బైండు.

వెల రు 1-8-0



వలయువారు:—

చందా నారాయణ శ్రేష్ఠి,
పుస్తకముల వ్యాపారము
జనరల్ బజార్ సికింద్రాబాద్.

బ్రాంచీలు:—
1. చార్‌కమాన్ హైదరాబాదు.
2. కొత్తబజార్ వరంగల్.

## గొప్ప రాజకీయ బుర్రకథలు.

1. డాక్టర్ పట్టాభి. వెల 0-3-0
2. హైదరాబాదుప్రజావిప్లవం ,,
3. రాణీ రజాకార్లు. ,,
4. ఆంధ్రకేసరి ప్రకాశం. ,,
5. కాంగ్రెసు విజయం. ,,
6. గాంధీ నిర్యాణం. ,,
7. జమీన్ రైతు ,,
8. ఆంధ్ర రాష్ట్రం ,,
9. హిందుస్థాన్ స్కౌట్ ,,
10. కాంభోజరాజు ,,
11. ఆజాద్ హింద్‌ఫౌజు. ,,
12. సుభాస చంద్రబోస. ,,
13. సర్దార్ పటేల్. ,,
14. జవహర్‌లాల్ నెహ్రూ. ,,
15. కాశిం రజ్వీ ,,
16. ఆంధ్రనాయకులజీవితము ,,
17. తొల్లేటి రైతు ,,
18. బాపూజీ ,,
19. నేతాజీ (జై హింద్) ,,
20. పండిట్ నెహ్రూ ,,
21. రజ్వీ రజాకార్లు ,,
22. బా ల రా జు ,,
23. రజాకార్ల దురంతములు ,,
24. సంస్థానదుండగాలు ,,

శ్రీ బాలాత్రిపురసుందరీ ముద్రణాలయము, జనరల్ బజార్ - సికింద్రాబాద్.